# కోళ్లపరిశ్రమ





డాక్టరు, యేజెళ్ల శ్రీరాములుచౌదరి.

పశువైద్య గ్రంథనిలయ 6వ పుష్పము.

# కోళ్ళ పరిశ్రమ.

గ్రంథకర్త:
వెటర్నరీ ఆయుర్వేద వైద్యభూషణ,
డాక్టరు, యేజళ్ళ శ్రీరాములుచౌదరి.

శ్రీ [illegible] గ్రంథాలయము,
తెలప్రోలు.

ముద్రాపకులు:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

1932.



వెల రు 0-8 0.

5

# విన్నపము.

ఈ కోళ్లపరిశ్రమ మాపశువైద్యగ్రంథనిలయముయొక్క పంచమపుష్పము. ఇది యొక అమూల్యమైన చిన్నిపొత్తము. ఈ గ్రంథరచనకు ముఖ్యకారణము కోళ్లసంపత్తి క్రమేపి క్షీణదశలోనికి వచ్చుటయే. కోళ్లపరిశ్రమకూడ రైతులకు సంబంధించిన ముఖ్యమైన ఉపవృత్తులలో నొకటి. అందుచేతనే నీగ్రంథము ప్రచురించి ఆంధ్రలోకమునకు సమర్పించితిని. కాబట్టి సోదరులారా! ఈగ్రంథముయొక్క ప్రయోజనమును గమనించి నేజేసినస్వల్పప్రయత్నమునకు తోడ్పడుదురుగాక యని ప్రార్థించుచున్నాను. మాతృభాషయగు ఆంధ్రభాషలో నీసంపత్తిని గురించి యింతవరకెక్కడను వెలువడి యుండలేదు. నేను కోరినంతనే కృతిభర్తగా నుండుటకు దయతో నంగీకరించిన శ్రీయుత వల్లభనేని మల్లిఖార్జునుడు చౌదరిగారికిని, ఈగ్రంథరచనకు తోడ్పడిన పౌల్ట్రీఫార్మింగ్, వ్యవసాయ పత్రికాధిపతిగార్లకును, సకాలములో నచ్చొత్తించి యిచ్చిన శ్రీఆంధ్ర గ్రంథాలయ ముద్రణాలయమువారికిని, ఈ గ్రంథరచనకై నన్ను ప్రోత్సహించిన రావెళ్ల వెంకట్రామయ్య, ఆట్లూరి వెంకటసుబ్బయ్య, కోనేరు శ్రీహరినారాయణగార్లకును నావందనములర్పించుచున్నాను. తప్పులున్న పాఠకులు మన్నింతురుగాక.

అంగలూరు.
4-4-32.

ఇట్లు
గ్రంథకర్త.
శ్రీ వేమన గ్రంథాలయము,
తేలప్రోలు.

7

# ప్రేమాంకితము.

నిరాడంబరులును, సాధుసత్తములును

వర్తకశిఖామణులును, దానశీలురు

నగు

శ్రీయుతులు

వల్లభనేని మల్లిఖార్జున చౌదరిగారికి

వారికి ప్రియమగు భావములచే

నొప్పు నీ

## "కోళ్లపరిశ్రమ"

సాదరముగ సమర్పించుకొంటి.

— గ్రంథకర్త.

# ఆయుర్వేదపశుచికిత్సాలయము,

## అంగలూరు, (కృష్ణాజిల్లా).

### అభిమానులు.

శ్రీయుత గౌ. ది. బ. బి. మునుస్వామినాయుడుగారు, మదరాసు గవర్నమెంటు ప్రధానమంత్రి.
(పశువైద్య వస్తుగుణదీపిక - పీఠిక కర్తలు.)

,, శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహాదరు జమీందారుగారు, చల్లపల్లి.

,, రాజా వేంకటాద్ర్యప్పారావు బహద్దరు జమీందారుగారు, ఉయ్యూరు ఎస్టేటు.

,, రాజా బలుసు బుచ్చిసర్వారాయుడుబహద్దరు జమీందారుగారు, కపిలేశ్వరపురం.

,, ముళ్ళపూడి తిమ్మరాజు జమీందారుగారు, తణుకు.

,, రాజా కం. సీతారామారావు బహద్దరు జమీందారుగారు, నూజివీడు.

,, రాజా నాయని వెంకటరంగారావు బహద్దరు జమీందారుగారు, మునగాల.

,, మోతే గంగరాజు జమీందారుగారు, ఏలూరు.

శ్రీయుత రాజా కమదన వెంకటవరద శోభనాద్రి అప్పారావు బహద్దరు గారు, నూజ.

,, రాజా వాసిరెడ్డి శ్రీ చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దరు మన్నెసుల్తాన్ గారు, ముక్త్యాల.

,, రాజా వాసిరెడ్డి వాసుదేవచూడామాణిక్య ప్రసాద్ బహద్దరుగారు, చెరుకూరు ఎస్టేటు.

,, అడ్డుమిల్లి గోపాలకృష్ణయ్య చౌదరి గారు, రెడ్డిగూడెం-రంగాపురం జమీందార్లు.

,, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి గారు, యం.యల్.సి., జిల్లాబోర్డు ప్రెసిడెంటు, గుంటూరు.

,, కొమ్మారెడ్డి పట్టాభిరామయ్య చౌదరి గారు, యం.యల్. సి., బందరు.

,, జంపాల వెంకటేశం చౌదరిగారు, దివాను ఆఫ్ దేవరకోట పరగణా.

,, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, ఆంధ్రపత్రికాధిపతులు, మద్రాసు.

,, అమిలినేని కొండప్పగారు. యం. యల్. సి. అనంతపురం.

,, పింజల సుబ్రహ్మణ్యం శెట్టిగారు, సమదర్శిని పత్రికాధిపతులు, మద్రాసు.

శ్రీయుత చల్లా శేషగిరిరావు పంతులుగారు, ఆంధ్ర పత్రికా సహాయ సంపాదకులు, మద్రాసు.

,, కొడాలి శివరామకృష్ణయ్య పంతులుగారు, ఆంధ్ర పత్రికా ఆఫీసు, మద్రాసు.

,, చలసాని సత్యనారాయణ చౌదరిగారు, యం. యల్. సి. గుంటూరు.

,, చిట్టూరి యింద్రయ్య చౌదరిగారు యం. యల్. సి. నరసాపురం.

,, దావులూరి మునికన్నయ్య నాయుడుగారు, బి. ఏ., బి. యల్., మద్రాసు.

,, వేమన వేంకటాచలం నాయుడుగారు, తిరుత్తని.

,, పరుచూరు సుందరవరదులుగారు, కవితా నిపుణులు, మద్రాసు.

,, గోగినేని రంగనాయకులుగారు, బి. లిట్. ఆక్సుఫర్డు, పశువైద్య చింతామణిపీఠికకర్తలు.

,, మూగంటి బాపినీడుగారు, బి. యస్ సి., కాలిఫోర్నియా, పశువ్రణచికిత్స పీఠికకర్తలు.

,, కల్లూరి చంద్రమౌళిగారు, బి. యస్. సి., ఎబర్డీన్, పశునేత్ర చికిత్సపీఠిక కర్తలు.

,, వెలగపూడి రామకృష్ణ, ఐ.సి.యస్.గారు, మద్రాసు.

,, వల్లభనేని బాపయ్య చౌదరిగారు, గద్దవల్లేరు

శ్రీయుత అడుసుమిల్లి హరినీడుచౌదరిగారు, గుడివాడ.
,, కోగంటి వెంకటాద్రియ్య చౌదరిగారు, గుడివాడ.
,, కె. రమణయ్యనాయుడుగారు, బి. ఏ. బి. యల్. బందరు.
,, వడ్లపట్ల కొండయ్యచౌదరిగారు, ఏలూరు.
,, బిక్కిని వెంకటరత్నం చౌదరిగారు, రామచంద్రపురం.
,, బిక్కిని వీరాస్వామి చౌదరిగారు, తాటిపాక.
,, గుడివాడసూర్యనారాయణనాయుడుగారు, కైకలూరు.
,, మారిన నరసన్నగారు, రాజమండ్రి.
,, సుంకర బసవయ్యగారు, ఆత్కూరు.
,, కాజ లక్ష్మినారాయణ చౌదరిగారు, పెదగొన్నూరు.
,, పర్వతనేని భూషయ్య చౌదరిగారు, నూజెళ్ల.
,, కొడాలి ఉమామహేశ్వరరావుగారు, జవర్లపూడి.
,, హనుమోర రామస్వామిగారు, పెమ్యేరు.
,, అక్కుమిల్లి రామదాసుగారు, చందాల.
,, పోలవరపు రామయ్యగారు, శేరీకలవపూడి.
,, పర్యావుల కేశన్నగారు, పెద్దకవరుంట్ల.
,, కామినేని పట్టాభిరామయ్యచౌదరిగారు, వరహాపట్నం.
,, రావెళ్ల వెంకటాద్రియ్యగారు, జుజ్జవరం.
,, పాతూరి చినవీరయ్యగారు, గారపాడు.
,, వట్టికూటి నాగయ్యగారు, మండూరు.
,, పోలవరపు మధుసూదనరావుగారు, పునాదిపాడు.

శ్రీయుత సుంకర రంగారావుగారు, పానకుమాడు.
,, పాతూరి పెదవీరయ్యగారు, గారపాడు.
,, పోతినేని శ్రీరాములుగారు, గారపాడు.
,, పాతూరి పున్నయ్యగారు, గారపాడు.
,, కిలారు గోవిందయ్యగారు, కోమటిగుంట.
,, అట్లూరి వెంకటసుబ్బయ్యగారు, పోలుమెట్ల.
,, కామినేని గోపాలకృష్ణయ్యగారు, చందాప్రోల.
,, వాడపల్లి రామయ్యపంతులుగారు, వాడపల్లి.
,, కొడాలి వీరభద్రరావు చౌదరిగారు, చినపాలపూడి.
,, బోళ్ళ బులిసుబ్బారాయుడుగారు, పొన్నపల్లియిటుకు.
పెదపట్నఅగ్రహారం.
,, అన్నమిల్లి వీరయ్యగారు, చందాప్రోల.
,, పాలడుగు రామకోటయ్యగారు, పెంజెండ్ర.
,, చింతపల్లి శంకరప్పగారు, ఉనికిలి.
,, పిన్నమనేని వీరయ్యగారు, రుద్రపాక.
,, గుళ్ళపల్లి రెడ్డయ్యగారు, మేడూరు.
,, చళ్ళగుళ్ళ వెంకటాద్రయ్యగారు, పెదపాలపర్రు.
,, పాట్లూరి లక్ష్మణస్వామిగారు, కొమరవోలు.
,, కాకర్ల కామేశ్వరస్వామిగారు, పెదముత్తేవి.
,, శిరిపురపు లక్ష్మినారాయణగారు, పెదసనగల్లు.
,, అట్లూరి రెడ్డియ్యగారు, పోలుమెట్ల.

శ్రీయుత కూరాడ వెంకటాచలంపంతులుగారు, కూరాడ.

,, వల్లూరు రామకృష్ణారావు పంతులుగారు, పెదమద్దాలి.

,, కూరాడ శాయన్న పంతులుగారు, కూరాడ.

,, ఘంటా లింగయ్యగారు, రామవరపుకోట.

,, జుజ్జవరపు వీరన్నగారు, వద్దిపర్రు.

,, చాగలి భద్రాద్రిరామయ్యగారు, గొల్లకోడేరు.

,, పోలవరపు వేంకటాచలంగారు, పెయ్యేరు.

,, పొట్లూరి సూర్యనారాయణ చౌదరిగారు, గుడ్లవల్లేరు.

,, చదలవాడ నాగభూషణంగారు, పేరుకలపూడి.

,, కోనేరు శ్రీహరినారాయణ చౌదరిగారు, మాచేడు మాక.

,, జంపాల సాంబయ్యచౌదరిగారు, దుగ్గిరాల.

,, మల్లిడి సత్తిరెడ్డిగారు, రెడ్డిరాణి పత్రికాధిపతులు, రాయవరం.

,, వల్లభనేని మల్లికార్జునుడు చౌదరిగారు, బెజవాడ. "కోళ్లపరిశ్రమ కృతభర్తలు"

,, పర్వతనేని సుబ్బయ్యచౌదరిగారు, పోలుకొండ.

,, పర్వతనేని బసవశాస్త్రులుగారు, పోలుకొండ.

,, రా. సా. కల్లి చిట్టి అబ్బాయినాయుడుగారు, పూళ్ల.

,, చింతలపాటి బాపిరాజుగారు, పత్తేపురం

శ్రీయుత శ్రీ రాంగోపాల్ లక్ష్మీనారాయణగారు, వర్తకులు, బెజవాడ.

,, నూనె పానకాలు శాస్త్రిగారు, వర్తకులు, చీరాల.

,, కేతమక్క శివరామశాస్త్రిగారు, మారేడుమాక.

,, కానూరి దామోదరయ్య చౌదరిగారు, కవుతరం.

,, వాసిరెడ్డి రామనాథంగారు, తాలూకాబోర్డు ప్రెసిడెంటు, నందిగామ.

,, కె. లక్ష్మయ్యనాయుడుగారు, బందరు.

,, యం. రామస్వామినాయుడుగారు, బందరు.

,, పి. వి. దాసుగారు, బందరు.

,, ఉట్లూరి సీతారామయ్యగారు, ఆత్కూరు.

,, కుదరవల్లి సూర్యరామ లక్ష్మయ్యచౌదరిగారు, నెమ్మకూరు.

,, కరిపినేని నాగయ్యగారు, కోరిమెర్ల.

,, కరిపినేని రజయ్యగారు, కోరిమెర్ల.

,, కామినేని నారాయణరావుగారు, వరహాపట్నం.

,, గాదిరాజు అచ్యుతరామరాజుగారు, గొల్లలకోడేరు.

,, చాపరాల వెంకటరత్నంగారు, నరెవూడి.

,, గట్టుపనేని గోపయ్యగారు, చినగాదెలవర్రు.

,, జాస్తి వెంకటసుబ్బయ్యగారు, పెదపూడి.

,, మద్దాలి పుల్లయ్యగారు, పునాదిపాడు.

శ్రీయుత సూరపనేని భూషయ్యగారు, పానుకుమాడు.
,, అడ్డమిల్లి పెదవెంకటనారయ్యగారు, కోలవెన్ను.
,, పర్వతనేని చినకామయ్యగారు, ఈడుప్గల్లు.
,, పర్వతనేని వెంకటరత్నంగారు, ఈడుప్గల్లు.
,, బూరుగడ్డ జగన్నాథరావునాయుడుగారు, కంకటావ.
,, మండా రాఘవయ్యగారు, మొవ్వ.
,, మండా సత్యనారాయణగారు, మొవ్వ.
,, కొల్లి వెంకటకృష్ణయ్యగారు, నరసన్నపాలెం.
,, డాక్టర్ వి. లక్ష్మయ్యగారు, మొవ్వ.
,, యేజెళ్ళ వెంకటసుబ్బయ్యగారు, రుద్రవరం.
,, మన్నె వెంకటనారాయణగారు, దేవ.
,, తాళ్ళూరి గోపాలకృష్ణయ్యగారు, యలమంచిలి.
,, బడే వెంకటసుబ్బారావు నాయుడుగారు, పిట్టలంక.
,, అన్నె సాంబయ్యగారు, అన్నవరం.
,, వల్లభనేని వెంకటకృష్ణయ్యగారు, గండిగుంట.
,, యార్లగడ్డ వెంకటకృష్ణయ్యగారు, కపిలేశ్వరపురం.
,, నిమ్మగడ్డ వెంకటరత్నంగారు, చంద్రాల.
,, దేవినేని సీతారామయ్యగారు, మునునూరు.
,, మాగంటి వెంకటకృష్ణయ్యగారు, రాచపట్నం.
,, మాగంటి సుబ్బారావుగారు, రాచపట్నం.
,, మాచనేని వెంకటాద్రియ్యగారు, కవులూరు.

శ్రీయుత అట్లూరి రామయ్యగారు, చవుటుపల్లి.
,, సూరపనేని గోపాలకృష్ణయ్యగారు, పాములపాడు.
,, కేతినేని తిరుపతయ్యగారు, వేమండ.
,, మోటూరు పెదపిచ్చయ్యగారు, దొండపాడు.
,, యలమంచి తిరుపతయ్యగారు, కనుమూరు.
,, పుట్టగుంట కోటయ్యగారు, గోపువానిపాలెం.
,, కామినేని వెంకటాద్రియ్యగారు, కొరిమెర్ల.
,, పుట్టగుంట సత్యనారాయణగారు, గోపువానిపాలెం.
,, అడ్సుమిల్లి సుబ్బారావుగారు, కల్లూరుపాలెం.
,, అడ్సుమిల్లి సుబ్బారావుగారు, గుడ్లవల్లేరు.
,, కొడాలి వెంకటరత్నంగారు, యలమర్రు.
,, చేగొండి రామజోగయ్యనాయుడుగారు, దొడ్డిపట్ల.
,, యార్లగడ్డ వెంకటాద్రియ్యగారు, గోపువానిపాలెం.
,, కనివారపు సుబ్బారావుగారు, తాడేపల్లిగూడెం.
,, అడ్సుమిల్లి వెంకటాద్రియ్యగారు, చందాప్రోల.
,, బూరుగపల్లి సూరన్నగారు, ఉండ్రాజవరం.
,, అట్లూరి పెదవెంకటసూర్యనారాయణ రాజుగారు, చింతలపల్లి.
,, సూర్యదేవర రాఘవయ్యగారు, కొల్లూరు.
,, అడ్సుమిల్లి నరసింహారావుగారు, శిరిపురం.
,, చలసాని వెంకటకృష్ణయ్యగారు, శేరీకలవపూడి.

శ్రీయుత పులికొల్లు రామయ్యగారు, సత్యవోలు.
,, పి. శ్రీనివాసులు రెడ్డిగారు, వేనాడ.
,, టి. డి. మల్లప్పగారు, గజ్జెహళ్ళి.
,, కొత్తపల్లి నరసింహంగారు, పాలమూరు.
,, దీవి వెంకటనృసింహాచార్యులుగారు, నల్లూరు.
,, ఎర్నేని లక్ష్మీనారాయణగారు, బెజవాడ.
,, జి. నరసింహారెడ్డిగారు, జోహారాపురం.
,, గొంది లక్ష్మీనారాయణగారు, జంపని.
,, టి. వి. సూర్యనారాయణమూర్తిగారు, అంగర.
,, నడింపల్లి బంగారాజుగారు, వన్నెచింతలపూడి.
,, పాతూరి రత్నంగారు, ఉంగుటూరు.
,, కోన ఆదినారాయణనాయుడుగారు, కృష్ణాపురం.
,, వేగుంట అప్పారావుగారు, పట్టూరు.
,, చోడే అప్పారావుగారు, కాకినాడ.
,, కె. రామయ్యగారు, కొండ్లోపల్లె.
,, గడ్డం యెరుకల రెడ్డిగారు, రెడ్డింబులవారిదిన్నె.
,, మాగం వెంకటాద్రియ్యగారు, వేల్పుచెర్ల.
,, సెక్కంటి సుబ్బారాయుడుగారు, దేశ.
,, కె. మనుబ్రహ్మాచార్యులుగారు, పెదన.
,, కె. యస్. రామస్వామి అయ్యంగార్, కొప్ప
,, యలమంచి వెంకటరత్నంగారు, వేమూరు.

శ్రీయుత కనుపర్తి లక్ష్మీనృసింహాంపంతులుగారు, తిరుమలాపురం.

,, యేజెళ్ళ శేషయ్యగారు, రుద్రవరం.

,, డిటో బాపయ్యగారు, డిటో

,, డిటో కొండయ్యగారు, పాములపాడు.

,, డిటో గోపాలకృష్ణయ్యగారు, రుద్రవరం.

,, యం. భద్రయ్యగారు, గోళ్ళమూడి.

,, ఆట్లూరి పెదనాగభూషణంగారు, రుద్రపాక.

,, ఆరెకపూడి రామశాస్త్రులుగారు, యూనియను బోర్డు ప్రెసిడెంటు, అంగలూరు.

,, అట్లూరి ధర్మారావుగారు, బి. ఏ., బి. యల్., గుడివాడ.

,, త్రిపురనేని సూర్యాజీరావుగారు, బి. ఏ., బి. యల్. గుడివాడ.

,, గొట్టిపాటి వెంకటేశ్వరరావుగారు, బి.ఏ., బి.యల్., బెజవాడ.

,, పెందుర్తి వెంకటసుబ్బయ్యగారు, బి. ఏ., బి. యల్., బెజవాడ.

,, పిన్నమనేని లింగయ్యగారు, బి. ఏ., బి. యల్., బందరు.

,, ఆరెకపూడి రామశాస్త్రులుగారు, చెర్వుపల్లి మునిసిఫ్, అంగలూరు.

శ్రీయుత దుక్కిపాటి శాయన్నగారు, పెద్యేరు.

,, మూల్పూరి వీరయ్యగారు, ఎలుకపాడు.

,, దుగ్గిరాల పూర్ణయ్యగారు, అంగలూరు.

,, చెరుకూరి కోటయ్యగారు, పెరిసేపల్లి.

,, చెరుకూరు పెదఅంజయ్యగారు, పెరిసేపల్లి.

,, వల్లభనేని సుబ్బారావుగారు, గుడ్లవల్లేరు.

---

# విషయసూచిక

శము - కాలేయము - ఆంత్రాంతము - ఆహారమును జీర్ణింప జేయు రసములు - హృదయము, రక్తప్రసరణము - ఊపిరి తిత్తులు, శ్వాస పీల్చుట.

## నాలుగవ భాగము.

గ్రామములలో రైతులుచేయు పనులు - కోళ్లగూళ్లు - కోళ్ళ ఎరువు - కోళ్ళకయస్సు కనుగొనుట - ఆహారము - వేళలప్రకారము ఆహారము పెట్టుట - ఉదయము - మధ్యాహ్నము - సాయంకాలము - కోడిపిల్లలకు పెట్టుఆహారము - మొదటివారము - రెండవవారము - మూడునాలుగు వారములలో - నీటితొట్లు.

## అయిదవ భాగము.

కోడిగుడ్ల నిర్మాణము - గుడ్డుపైనుండు చిప్ప - తోలు - లోపలనుండు ద్రవములు - గ్రుడ్డను పరీక్షించు విధము - గ్రుడ్లను పరీక్షించు యంత్రము - మొదటిరకపు గుడ్లు - రెండవరకపు గుడ్లు - మూడవ రకపుగుడ్లు - కోడిగుడ్లు పిల్లలగు విధము - కోడిపిల్లలను కాపాడు గంపలు - గుడ్లనుపొదిగించు యంత్రములు - ఉష్ణవాయు యంత్రము- జలపేటికాయంత్రము - కోళ్ళకు సంభవించు వ్యాధులు - కోళ్ళ ఆరోగ్యము - ఉష్ణము - దేహపరిశ్రమ - నాడి

కొట్టుకొనుట - వ్యాధిని కనుగొనుట - వ్యాధి నిర్ణయము - రోగలక్షణములనుబట్టి చేయు చికిత్స-జబ్బుకోడిని పరీక్షించుట- ఊపిరితిత్తుల వాపు - అజీర్తి - అటలమ్మ - మశూచి - రక్తహాని - అతిసారము - దగ్గు - రొంప- వంటుట - కనుపులో నొకజాతిపురుగులు పుట్టుట - ఎఱ్ఱని పురుగులు పట్టుట - పేలు - కంతిరోగము - టీకాలు వేయుట - మట్టిలో చూర్ణములు చల్లుట - పెట్ట గుడ్లు పెట్టలేకపోవుట - వాతము - కలరా.

## ఆఱవ భాగము.

బాతులను పెంచుట - శరీరనిర్మాణము - కాళ్ళు - పాదములు - ముట్టె - కంఠము - శరీరముపైనుండు కప్పు - బాతులను పెంచువారికిఁదగిన విషయములను తెలిసికొనవలెను - బాతుల గుడ్లు.





పురాతన ఇంగ్లీషు పందెపుకోళ్ళ జాతులు.

# కోళ్లపరిశ్రమ

## మొదటిభాగము.

### కోళ్లను పెంచు టెట్లు ?

కోళ్లను పెంచుట మంచిలాభకరమగు వృత్తియై యున్నది. పాశ్చాత్యదేశములయం దియ్యది చాల అభివృద్ధికళలో నున్నది. పాశ్చాత్యప్రభుత్వము వారు వ్యవసాయముతో బాటుగా దీనికికూడ నెంతో ప్రోత్సాహ మొసగుచున్నారు. ఇందులకు సంబంధించిన విజ్ఞానమునుకూడ దీని నొకవిషయముగా వృత్తి విద్యాలయములందు బెట్టి ప్రజల కలవడజేయుచున్నారు. ఈవిషయమును గూర్చి పెక్కు పరిశోధనలనుగూడ జరిపించి అభివృద్ధి మార్గములను ప్రవేశపెట్టుచున్నారు. నానాటి కిది యభివృద్ధి నొందుచున్నది. అనేకు లీవృత్తి నవ

లంబించి అధికలాభముల నొందుచున్నారు. ఇంకను కోళ్లను పెంచుట వ్యవసాయకులకు ముఖ్యవృత్తులలో నొకటిగ సహాయపడుచున్నది. కాని మన దేశములో నక్కడక్కడ ప్రయత్నములు జరిగినను ఇంక నిది సరిగా తలయెత్తలేదనియే చెప్పవలసివచ్చుచున్నది. కోళ్ల పెంపక మొక ప్రత్యేక వృత్తిగా మన దేశమున నింకను సరిగా గుర్తింపబడలేదు. అంతవిరివిగా నవలంబింపబడుట లేదు. మన దేశపువ్యవసాయమును గురించి విచారించుటకు నియమింపబడిన రాయల్ కమీషనువారుగూడ మన రైతుల కిట్టి ఉపవృత్తులగల్పింపవలయుననియు, వానినిగురించి పరిశోధనల గావించి ప్రోత్సహింపవలయుననియు సూచించిరి. ఈ దేశములో అగ్రవర్ణములకు జెందినవారికి కోళ్లను పెంచు పరిశ్రమ ఉపయోగపడకపోయినను రైతులలో సత్యధిక సంఖ్యాకులగు ఇతరవర్ణముల రైతుల ఆర్థికస్థితిని అభివృద్ధిపరచుటకు చాల తోడ్పడగలదు.

కొన్ని సంవత్సరములకు పూర్వము కోయంబత్తూరు, హోసూరులందు వ్యవసాయ పరిశోధనాలయములు స్థాపించినపుడు కొంత పరిశ్రమను గూడ వారచట ప్రవేశపెట్టిరి. కాని తరువాత నీవిషయమై తగినంతశ్రద్ధ వహింపజాలకపోయిరి. మన దేశములో నిటువంటిసంస్థలు పెట్టినతరువాత యేమాత్రము నష్టము వాటిల్లినను ఆసంస్థను నిలిపివేయుదురు. పాశ్చాత్యు లట్లు కాదు. కొంతకాలమా సంస్థను నడిపి మంచిచెడ్డలు విచారించుకొని తరువాత వారు వానిని విడిచిపెట్టుదురు. దేశము నానాటికి విజృంభించు చుండగా, నిరుద్యోగ సమస్య చుట్టుముట్టి అలయించుచుండగా, తత్పర్యవసానముగ దారిద్ర్యదుఃఖమున మునిగి తేలుచుండగా, నిట్టిలాభప్రదమగు వృత్తు లుపేక్షింపబడుచుండుట విచారకరము గాకపోదు. ఇందువలన నేటి దుర్భరదారిద్ర్యమును కొంతవరకు మనమే కోరి తెచ్చిపెట్టుకొనుచున్నట్లుగా గూడ

విదితముగాకపోదు. ఇట్టివిషయములయందైనమన మికనైన మేల్కొని మనబాగునకై మనము ప్రయత్నించు టెంతయు శ్రేయస్కరము. ఇందుకు పాశ్చాత్యులప్రయత్నములు మనకెంతయు ఆదర్శప్రాయములుగా నున్నవి. మనది ఉష్ణదేశమగుటచేతను, ఇంకను వ్యవసాయమే ముఖ్యపరిశ్రమగలదేశమగుటచేతను, కోళ్లపెంపకమునందు మనకే యెక్కుడు సౌకర్యము లున్నవనికూడ గట్టిగా నొక్కి వక్కాణింప వచ్చును. అందువలన బయలుదేర తీసినమార్గము లనుబట్టి వారు గావించిన పరిశోధనలు, యంత్రములు మున్నగువాని సహాయమున మన మీ విషయములో తగినంత శ్రద్ధవహించి పనిచేసినచో వారికన్న నెక్కుడభివృద్ధిలోనికి తీసికొని రాగలమనుటకేమియు సందియములేదు. ఈసంస్థలను తెలుగుజిల్లాలలోకూడ నక్కడక్కడ స్థాపించుచున్నారుగాని వాని కుపయోగించు పద్ధతులు సరియైనవి తెలియక నశించు

చున్నవి. కాబట్టి ఇటువంటిసంస్థలను స్థాపించుట కును, నేను ముందు చెప్పబోవువిషయములను గ్రహింపగలందులకును తమ్ముల్లరను ప్రార్థించు చున్నాను.

## కోళ్లనుగురించి ముఖ్యముగ గమనింప వలసిన విషయములు

1. కోళ్ళను పెంచువారు మంచిబుద్ధి, మంచి సాంప్రదాయము, పట్టుదల, శ్రద్ధ గల కోళ్ళను పెంచవలెను. ఇంకను వీటికి సంబంధించిన గ్రంథ ములుకూడ సంపాదించవలయును. ఇవి లేనివారు కోళ్ళను పెంచుటకు తగరు.

2. కోళ్ళను పెంచుటలో బహు జాగ్రత్తగా లాభనష్టములను గుర్తించుచుండవలెను. తొందర యెంతమాత్రము పనికిరాదు. అందువలన నష్ట ములు సంభవించును. జాగ్రత్తగా చేసికొనునెడల నిది మిగుల లాభమిచ్చు వ్యాపారమై యున్నది.

ఏమాత్ర మజాగ్రత్తగా నున్నను ఈపని అతి నష్టమును గలుగజేయును.

**3.** కోళ్ళవలన లాభము కోరువారు ఎన్నికోళ్లు తమ కున్నవో తెలిసికొని ఒక చిట్టాను పెట్టి జమా ఖర్చులు వ్రాయుచుండవలయును.

4. ఒక్కొక్కకోడికి తమ కెంత ఖర్చయినదో లెక్క చూచుకొని, దాని ననుసరించి వెల నేర్పరచవలెను. లేనియెడల నష్టమువచ్చును. ఏ కాలములో దేనికి వెలహెచ్చో ఆ కాలమున దాని నమ్మవలెను. హెచ్చుఖర్చుగాకుండగను, ఆరోగ్యము చెడకుండగను కాపాడవలెను.

5. వర్షములు కురియునప్పుడును, చలిగాలి వీచునప్పుడును, మంచుకురియునప్పుడును కోళ్లను బైటకు పోనీయరాదు. అట్లు పోనిచ్చినయెడల వాని యారోగ్యము అందము చెడిపోవును.

6. కోళ్ళశరీరములపై పురుగులు లేకుండునట్లు కాపాడవలెను. ఎంతమంచి ఆహారము పెట్టినను పురుగులున్నకోళ్లు ఆరోగ్యముగా నుండవని తలంచవలయును.

7. అంటురోగములు సోకినవెంటనే ప్రత్యేక స్థలమునందు మంచికోళ్ళ నుంచి కాపాడవలెను. అంటురోగములు తగిలిన పక్షులను ప్రత్యేకముగా నుంచి రోగమునుబట్టి తగిన చికిత్స జేయుచు, తేలికైన ఆహారమును సకాలమున బెట్టుచు జాగ్రత్తగా కాపాడవలెను.

8. అపియుండు ప్రదేశములు పరిశుభ్రముగ లేనప్పుడును, అనారోగ్యములగు ఆహారములు పెట్టినప్పుడును, తేమగల ప్రదేశములలో తిరుగనిచ్చినప్పుడును పక్షులకు రోగములు వచ్చును.

9. పక్షులనొక్క కొట్టలతోను, లేనితరముగు వాటితోను, అసహ్యకరమగు ప్రదేశములలో

గింజలు మున్నగువానిని జల్లి పక్షులను విడిచి పెట్టినయెడల అవి భుజింపవు. కాబట్టి పక్షులు తిరుగు ప్రదేశము మిగుల పరిశుభ్రముగా నుండవలెను.

10. ప్రతిదినము పరిశుభ్రమగు నీరిని మంచి పాత్రలలో బెట్టవలెను. కొందరు అసహ్యకరమగు రేకుపళ్ళెరములు మొదలగువానిలో నీరుపోసి పెట్టుదురు. ఈ పాత్రలకంటె మట్టిపాత్రలే శ్రేష్ఠమైనవి.

11. కోళ్ళవిషయమై తీసికొనవలసినరీతిగా జాగ్రత్తతీసికొననియెడల యెంతమాత్రము లాభము లేదు. అజాగ్రత్తగా పెంచిన పక్షులవలన గుడ్లు లభింపజాలవు.

12. తోటలలో తిరిగి చెట్లను, మొక్కలను చెరుచు పురుగులను కోళ్ళు చంపి తినును. అందువలన మొక్కలు సురక్షితముగ నుండును.

13. కోళ్ళకు సయిత మాహార మెక్కువగా తోటలలోనే దొరకును. చెట్లక్రింద రాలు కాయ గబురుల నెప్పటికప్పుడు తీసివేయించినచో కోళ్లు వానిని తినుట కలవాటు పడవు.

14. కోడిజుట్టువలన కోడియొక్క ఆరోగ్యము తెలిసికొనవచ్చును. జుట్టుపై నలుపురంగుగలమచ్చ లున్న యెడల నది మదించి ఆరోగ్యమును పాడు చేసికొనుచునని గ్రహించవలెను.

15. సాధారణముగా కోళ్ళకు త్రాగునంతనీ రొసంగవలసియుండుట ముఖ్యవిషయమని తెలిసి యు చాలవరకు నుపేక్షింపబడుచున్నది. మామూ లుగా వానికి సరిపోవు నీ రొసంగబడుటలేదు. వేసవి కాలములో బాగుగా పెరిగిన ప్రతికోడియు దిన మున కొక అర్ధసేరు నీటికి తక్కువ త్రాగదు.

16. కోడినితూచిన బరువులో నూటికి 55 మొదలు 75 వంతులవరకు నీటిబరువే యను విష

యము నెరిగినచో పై విషయ మాశ్చర్యకరము గాక పోదు. నీరు సరిగా పెట్టనిచో నవి గుడ్లను సరిగా పెట్ట జాలవు. అందువలన కోళ్లను పెంచువా రీ విషయ మున చాలశ్రద్ధ వహింపవలసియున్నది.

17. నీరుపెట్టు తొట్టెలను ఎక్కువగా నుంచి ఎప్ప టికప్పుడు వానిని నీటితో నింపుచుండవలెను. ఇంక నీటిపాత్రలయడుగుభాగమున యెట్టిపదార్థములు లేకుండ జాగ్రత్తగా పరిశుభ్రపరచవలెను.

18. కోళ్లను రాళ్లు, కంకర, ముళ్లతీగెలు, ఇటుకలు మొదలగువానిమీదకు పరుగెత్తించ రాదు. రాత్రిపూట పిట్టలన్నియు గూళ్లుచేరిన తరువాత యజమాని వాని నొకసారి పరీక్షించ వలెను.

19. మురికిగలచోటులందు పక్షులను విస్తార ముగా తిరుగనీయరాదు. చచ్చినవాటిని నిలువ యుంచక వెంటనే పారవేయవలెను.



పందెపుకోడి.

దూసరరంగు గల లెగ్ హారన్.

1

20. కోళ్లు యెక్కువగానున్నవని సంతోషించరాదు. అవి ఆరోగ్యవంతములుగను, బలముగలవిగను యుండునట్లు చేసిన సంతోషించవలెను.

21. కోళ్ల యారోగ్యము బాగుగానుండిన యెడల మనకు తగినసహాయముచేయుచుండుటయే గాక సర్వాంగసుందరములును, సంతోషజనకములును, భావిసహాయకారులును నగు కోళ్లగుంపుల కాకరములై యజమాని నానందాంబుధియందోల లాడించుచుండును.

22. కోళ్ల నన్నిటిని మందలుమందలుగా నుంచవచ్చునుగాన వానిని పెంచుటలో నంతగా ప్రయాసయుండదు. కోళ్ల పెంపకమునకు ప్రత్యేక ఆవరణ ముండవలెను. వీటికి ప్రత్యేకముగ నిర్మింపబడిన కొట్టములు నీడపందిళ్లు నుండవలెను. ఆవరణములో నవి స్వేచ్ఛగాతిరుగుచు, గడ్డి గాదములయందుండు మొక్కలను పురుగులను యేరుకొని

తినుటకు వీలుగా నుండవలెను. ఇంకను పిల్లలకు ప్రత్యేకపు ఏర్పాటులు చేయవలెను.

23. గ్రుడ్లుపెట్టు పెట్ట యెదురురొమ్ముదగ్గర బలిసియుండవలెను. వెనుకవైపున విశాలముగా నున్నపెట్ట ఎక్కువగుడ్లను పెట్టును. పొదిగించుటకు గుడ్లుపెట్టి వానికి తగినసౌకర్యముల నేర్పరచుట, పిల్లలను జేయించుటకువలయునేర్పాటులను జేయుట మున్నగువిషయములను గురించి చాల శ్రద్ధగా నుండవలెను.

24. పెట్టలసహాయములేకనే గుడ్లనుండి పిల్లలను జేయుట కొక యంత్రము కనిపెట్టబడినది. దీని సహాయమున పిల్లలను జేయించుట మిగుల తేలిక. ఇట్టి యంత్రములు కోళ్లపెంపకపుఆలయములందుండుటవలన పిల్లలను జేయించుటలో అంతగా ప్రయాసపడవలసిన అవసర ముండదు.

25. పుంజాలను, పెట్టలను అటూనిటూ తిరుగునపుడు ప్రత్యేకముగా నుంచుట మంచిది. అట్లుంచుటవలన నవి ఆరోగ్యముగా నుండును. ముసలివాటిని చిన్నపిట్టలతో కలిపి తిరుగనీయరాదు. కోళ్లు తమ యాహారమునకు వెదకుకొనవక్కర లేకుండునట్లు తెగ మేపి వానిసోమరితనమును వృద్ధి చేయరాదు. కోళ్లనన్నిటిని మందలు మందలుగా నుంచవచ్చును గాన వీనిని పెంచుటలో నంతగా ప్రయాస ముండదు.



# రెండవ భాగము.

## కోళ్లలోని జాతులు.

### టర్కీజాతి

ఈకోడి అమెరికాఖండమునుండి మొట్టమొదట తేబడినది. మూడునందలసంవత్సరములక్రిందట అమెరికానుండి యీపక్షి యూరప్పునకు తీసికొని రాబడినది. అప్పటినుండి ప్రపంచముయొక్క అనేక భాగములందు వ్యాపించియున్నది. అమెరికాలో కొన్నిచోట్ల అడవిటర్కీలు విస్తారముగా నున్నవి. వేటకాడు వానిని పట్టుకొనవలె నని పరుగిడలే నంత వడిగా నవి పరుగెత్తగలవు. ఎవరైన వాటిని యెదిరించినప్పుడుగాని, నదులు దాటు నప్పుడుగాని నవి వాటి రెక్కలను ఉపయోగపర చును. టర్కీ తానే కోళ్ళజాతికి రా జనుకొనినట్లుగా

నెమలివలె తోకవిప్పుకొని మెడపైకెత్తి గర్వముగా నడచును. ఇది తరచుగా పోట్లాడును గనుక నితర కోళ్లు దీనిమీద అంత యిష్టముగా నుండవు. ఎఱ్ఱగానుండు పదార్థమును చూచిన యెడల ఈపక్షి మిగుల కోపము గలిగియుండును.

## —* లెగ్ హార్న్ జాతి *—

అమెరికా దేశములో 3 తరగతుల జాతికోళ్లు గలవు. దూసర, తెలుపు, ముదికి రంగుగల కోళ్లు మాత్రము వానిలో సుప్రసిద్ధములైనవి. వానిలో జుట్టుగలజాతి యొకటియు, జుట్టులేనిజాతి యొకటియు గలదు. కాబట్టి జుట్టునుబట్టి ఒక్కొక తెగలో రెండేసి రకముల కోళ్లుండుటవలన మొత్తమువీూద ఆరురకముల కోళ్లని తెలియుచున్నది. ఈ జాతికోళ్ళు పెట్టు గ్రుడ్లను అమ్ము వర్తకులకు చాల లాభకరము.

తెలుపురంగుగల లెగ్ హారన్ జాతికోళ్ళు 1840 వ సంవత్సరములో మొదట అమెరికా దేశమునకు వచ్చినవి. ఆకాలములో న్యూయార్కుపట్టణములో పండ్లవర్తకుడైన ఆకర్ అను వాడు వీనిని కొనెను. ఈతనివలననే యీజాతి అమెరికా దేశమందు విస్తరిల్లినది. నల్లని ఈకెలుగల లెగ్ హారన్ జాతికోళ్ళు రీడ్ లెస్టర్ అను దొరగారివలన 1871 వ సంవత్సరములో అమెరికాఖండమునకు తీసికొని రాబడెను. ఇటలీ దేశమునుండి యి ట్లీజాతి అమెరికా దేశమునకు వచ్చినవి. అమెరికావారు వీనిని విశేషముగా వృద్ధిచేసిరి. ఈ విధముగనే ఇటలీవారుకూడ నీకోళ్ళను వృద్ధిచేసి వీటినుండి వాల్డరోన్న అను నొక క్రొత్తజాతికోడిని సృష్టించిరి. కొంచెము దూసరరంగుగల కోళ్ళు ఇంగ్లాండునకు గూడ 1872 వ సంవత్సరములో వచ్చినవి. అంతకు కొద్దిదినములకు పూర్వమే తెలుపు లెగ్ హారన్సు, ఇటలీదేశపు లెగ్ హారన్సు తమదేశపు

శీతోష్ణస్థితికి దగిన వని నిర్ధారణచేసి వీనిని తెప్పించిరి. ఇది మొదలుకొని డెన్మార్కు దేశములో కోడిగ్రుడ్లవ్యాపారము విస్తరిల్లినది. ఈ డెన్మార్కు దేశపుగ్రుడ్లు అమెరికాదేశమునకుగూడ నా కాలములో ఎగుమతి యగుచుండెను.

## —* మైనార్కుజాతి *—

మధ్యధరాసముద్రప్రాంతములలోని కోళ్ళలో మైనార్కుజాతి మిగుల ప్రశస్తమైనది. మెజార్కా, మైనార్కా, ఐవీకా యను ద్వీపములనుండి యివి మొట్టమొదట ఇంగ్లాండు దేశమునకు వచ్చినవి. వీనిని చాలకాలమువరకు నలుపుస్పానియాకోళ్ళనియు, ఎరుపురంగుగల ముఖముగల స్పెయిన్ దేశపుకోళ్ళనియు జను లనుకొనెడివారు. ఇప్పటికిని వీటిని స్పెయిన్ దేశపుకోళ్ళనియే భావింతురు.

## —* సీమకోళ్లు *—

పోలిష్ బ్యాంటమ్, సిల్కీస్, జపానీస్, బ్యాంటమ్, వైయాండోట్టీ మున్నగుజాతులన్నియు సిమకోళ్ళందురు. ప్రపంచములోని సీమకోళ్ళన్నిటిలోను వైయాండోట్టీజాతి ప్రశస్తమైనదిగా నెన్నబడుచున్నది. ఈజాతిలోగూడ ననేకరకముల పక్షులు గలవు. ఇందులో కొన్ని తెలుపుగను కొన్ని నలుపుగను, మరికొన్ని గోధుమరంగుగను, కొన్ని దూసరరంగుగను ఉండును. వీనిలో నెల్ల తెలుపుగానుండు పక్షులు మిగుల ప్రశస్తములైనవి. వీటినే ఇంగ్లీషువారు ఎక్కువగా ప్రేమించుదురు. ఇంగ్లీషులో దీనినే వైట్ వైయాండోటీ అని చెప్పుదురు.

## —* తదితరజాతులకోళ్లు *—

పోలిష్ బ్యాంటమ్, సిల్కీస్, జపానీస్, బ్యాంటమ్ అనునవి సీమకోళ్లేగాని అందమైన పిట్టలు.

18A



ప్రదర్శనపు కోళ్ళు.
(సిల్వర్ లేస్డు వ్యాండాట్సు).
3

ఇవి అందమునకు పనికివచ్చును. గుడ్లుకూడ చాలచిన్నవి. కాబట్టి వీనిని అందమునకే కొన వలెను. లెగ్‌హారన్, క్యాంపైన్, హాంబర్గ్, మైనార్కా అనుజాతులగు కోళ్లు గుడ్లను అతి విస్తారముగా పెట్టును. కాని మాంసమునకవి పనికి రావు. కొచ్చిన్, బహామా, డోర్కింగ్సు, ఇండియన్ గేమ్, లాంగ్‌షాన్ అనుజాతులకోళ్లు మిక్కిలి పెద్దవిగానుండి కండబట్టియుండును. ఇవికూడ అందమునకేగాని గుడ్లు పెట్టుటకు పనికిరావు.

## పెంపుడుకోళ్లు

ఇవి మొదట హిందూదేశమునందు అడవికోళ్ల నుంచి పుట్టినవి. కాని యిప్పుడు ప్రపంచమునం దంతటను కన్పడుచున్నవి. వీటిలో జింకిసీజాతి గలదు. ఇది మహాశౌర్యము గలది. ధరకూడ వంద రెండువందల రూపాయల ఖరీదువరకు గూడ నుండును. వీటిని వెలమదొరలు పెంచి అప్పు

డప్పుడు పందెములు వేయుచుందురు. ఇంకను గుబ లా, సాదారకములకోళ్లుకూడ గలవు.

—♦ వైట్ వైయాండాటీ కోడిలక్షణములు. ♦—

ఇది అందమైనపక్షి. దీనికితలమీద జుంజు రుం డును. ఇది చతురాకారముగా ప్రారంభమై గులా బిరంగుగలిగి వెనుకకు వ్యాపించి మెడయంతటను గలసి తుదకు మొన తేలును. దీనిముక్కు బంగారు రంగుకలిగి యుండును. కన్నులచుట్టు ఎరుపు రంగు ఉండును. మగపక్షి మూడుపీసెల బరు వును ఆడుపక్షి రెండుపీసెల బరువును యుండును. వీనితో సమానముగ గుడ్లను పెట్టగల కోళ్లు లేవు. మంచిజాతిపెట్ట సంవత్సరమునకు 260 గుడ్లు పెట్టును. ఒక్కొకగుడ్డు ఆరుతులముల బరువు గలిగియుండును. ఈ కోళ్లను విస్తారముగా ఎండ లోనికి పోనీయరాదు. వీటినిపెంచినట్లుగా ఇతర జాతికోళ్లను యూరపియనులు పెంచరు.



టర్కీకోడి

7

## —* మైనార్కాకోడి లక్షణములు *—

ఈ కోడితల పొడవుగాను వెడల్పుగాను నుండు
ను. చక్కని జుంజురు కలిగియుండును. ఈ జుంజురు
తాకుటకు మృదువుగా నుండక బిరుసెక్కి వంకర
టింకరులు లేక పొడుగుగా నిలిచియుండును.
కాని అది ప్రక్కల కొరుగదు. మరియు నీ జుంజురు
ముక్కుచివరవరకు వ్యాపించదు. దీని ముఖమున
ఈక లుండవు. ముడతలు పడవు. చెవిరంధ్రములు
మిక్కిలి తెలుపుగానుండును. లోతులేక కోలగా
నుండును. కన్నులు పొడవుగను, వంకరగను, కాంతి
గను నుండును. మెడ పొడుగుగా వంకరలు తిరిగి
యుండును. శరీరము పొడవుగ నుండును. పుష్టి
గలిగి సమానముగా నుండును. రెక్కలు అంత
పెద్దవిగా నుండవు. కాళ్లు, తొడలు కొలదిపొడవు
గలిగి బలముగలవిగా నుండును. ఇది సంవత్సరము
నకు 130 గుడ్లను పెట్టగలదు.

## —* కోడిపుంజుచేయు పనులు *—

ప్రతిగ్రామములోనుండు సామాన్యులుకూడ కోళ్లను పెంచుచుందురు. మగకోడికి పుంజు అని పేరు. పుంజు సొగసైన శరీరమును, ధైర్యమును గలిగియుండును. దాని భార్యలమధ్య నున్నపుడు మిక్కిలి గాంభీర్యముగాను, గర్వముగాను అది నడచును. అది దానిభార్యలకు ఆజ్ఞ లిచ్చును. కాపాడును. అది నడచుచుండగా మంచి యాహారము దొరకినయెడల దానిని వాటికి చూపించును. అది మరియొక పుంజునుజూచి యోర్వలేదు. దాని దగ్గరకు మరియొకపుంజు వచ్చినయెడల రెంటికిని తప్పకుండ దెబ్బలాట జరుగును. తల క్రిందకు పెట్టి మెడమీది వెండ్రుకలు బిరుసుచేసి యొక దానిని మరియొకటి ఊరక కొంతసేపువరకు చూచుకొనును. తరువాత నవి యకస్మాత్తుగా నొకదానిపై నొకటి పడి భయములేకుండ భూమి

యంతయు వాటి నెత్తురుతో తడియునంతవరకు పోట్లాడును. వాటికాలియొక్క వెనుకటి వ్రేలికి నొక చురుకైన చిన్నము లుండును. కోడిపందెముల యందిష్టముగల క్రూరాత్ములు కొందరు వీటికి పదునైన కత్తులుగూడ కట్టుదురు. ఆసియాలోని తూర్పు దేశములందలి జనులు యీకోడిపందెముల యందు చాలాశ్రద్ధ గలిగియుందురు. పందెము వేయుటలో తండ్రిలు తమపిల్లల భార్యల కూడ పందెపుధనముగా నుంచుదురు. కోడిపుంజు కొన్ని కాలములలో కూయుటకు చాలప్రసిద్ధి. కనుక నిది యొకవిధమగు గడియారముగా నుపయోగించును.

## —* పుంజు లక్షణములు *—

పుంజుతెల యందముగా నుండవలెను. మూతి పొడుగుగా నుండవలెను. మెడకూడ పొడుగుగా నుండవలెను. మెడమీది జుంజురు మంచిది యుండ

వలెను. జుట్టు గులాబిరంగువన్నె కలిగియుండ వలెను. ముక్కు వంకరగలిగియుండవలెను. ముక్కు వెనుకవైపునకు పోవుకొలదిని జుట్టు సన్నమై, పొడుగుగా నుండి వాలిపోక వంపుగా నుండక సమముగా నుండవలెను. ముఖము నునుపుగా నుండ వలెను. ఇంకను ముడుతలును, రోమములును లేని పలుచని చర్మమును గలిగియుండవలెను. మెడ సామాన్యపు పొడవుగలిగి భుజములవరకు వ్యాపిం పగలుగు నంతటి పొడవుగల ఈకెలతో నిండి నుండవలెను. శరీరాకారము ముక్కోణాకారము గ నుండవలెను. భుజముదగ్గర మిక్కిలిపొడవు లే కుండ విశాలము కలిగి తోకదగ్గర సన్నగిలియుండ వలెను. వక్షము గుండ్రముగను, పెద్దదిగను నుండ వలెను. అందములగు రెక్కలుగలిగి నుండ వలెను. తోకపొడవుగా నుండవలెను. అది వ్రేలాడు చుండి అందమును దెచ్చురీతిని మెలికలుతిరిగి

యుండవలెను. కాళ్లు మిక్కిలి పొడుగుగానుండ రాదు. తొడలు మృదువుగనుండి చిక్కగను, గుండ్రముగను నుండవలెను. సుమారు రెండుపీసెలన్నర బరువుగలిగియుండవలెను. ప్రతికాలికిని నాలుగు వేళ్లుండవలెను. అవి పొడుగుగానుండి వంకర లేక చక్కగా వ్యాపించియుండవలెను. రెక్కలు శరీరమున కంటుకొని యుండవలెను.

## —* పెట్ట చేయుపనులు *—

కోడిపెట్ట పిల్లలను బాగుగా సంరక్షణచేసెడు తల్లియై యున్నది. ఇది పుంజుకంటె చిన్నది. దీనికి దృఢమైనముక్కు గలదు. అదియే దీనికి నోరువలె నుపయోగించును. దీనికి పండ్లు లేవు. దీనికి రెక్కలున్నను అంతగా నెగురలేదు. ఇది నేలను గీరుకొను పక్షికూడనై యున్నది. ఇది దొడ్లలో తిరుగుచు పురుగులు మొదలగువానిని సంపాదించుకొనుటకు తనగోళ్లతో ఎప్పుడును భూమిని గీరి పిల్లలకు

ఆహారము చూపించుచుండును. పెట్ట ఇతరకాలములలో పిరికిగా నున్నను దానిపిల్లలకు హాని కలుగజేయు నని తోచెనేని కుక్కమీదగాని, మరియేజంతువుమీదగాని యెగిరి తన్ని పొడవబోవును. ఏదైన నొక యుపాయము రాబోవు నని తలచినయెడల నది దానిపిల్లల నన్నిటిని దగ్గరకు పిలుచుకొనును. అది కొక్ కొక్ అని చేసెడు ధ్వనిచేతనే పిల్లలన్నియు దగ్గరకు వచ్చి దానిరెక్కల క్రింద దాగును. కోడిపిల్లలు తమతల్లికి అణకువగా నుండునట్లుగా మనపిల్లలుగూడ తమతల్లులకు అణకువగా నుండినయెడల బాగుగా నుండును.

## —* పెట్ట లక్షణములు *—

పెట్టలు పుంజులక్షణములనే గలిగియుండవలెను గాని వెనుకపార్శ్వమున విస్తారముగా ఈక లుండరాదు. పెట్టతోకనైపు శరీరము విశాలముగానుండవలెను. గుడ్లుపెట్టుఅవయవములు శరీరమునకు

వెనుకభాగమున నుండుటచే ఆభాగము విశాలముగా విజృంభించియుండవలెను. పక్షిపెదురురొమ్ము దగ్గర బలిసియుండవలెను. వెనుకవైపు విశాలముగ నున్న పెట్ట ఎక్కువగుడ్లు పెట్టును.

---

# మూడవ భాగము.

## కోడిశరీరనిర్మాణము

కోళ్ళశరీరము ముందుభాగము సన్నముగ నుం డునుగాని క్రమక్రమముగా వెనకవైపునకు పోవు కొలది లావుగా నుండును. మరల తోకదగ్గర సన్నముగ నుండును. కోళ్ళు మనవలెనే రెండు కాళ్ళతో నడచును. కాని మనకున్న చేతులకు బదులుగా వాటికి తేలికగా నడచుటకు, పరుగెత్తు టకు, చెట్లపైకి యెక్కుటకు రెండు రెక్కలు గలవు. వీటిరెక్కలయందలి యెముకలు మన చేతులలో నుండు ఎముకలవలెనే యుండును. కాని ఈకెలు అమర్చబడుటకుగాను వాటిరెక్కలు ఒక విధముగా నుండును. రెక్కలయొక్క చివరలనుండు ఎము

కలు మనవేళ్ళ యెముకలవలెనే ఉండును కాని యవి చాలా పొడవుగా నుండును.

## —* రెక్కలు *—

రెక్కలు పరిమాణమందు వ్యత్యాసముగా నుండును. కోడిరెక్కలు గాలియందు ఎగురునట్లు చేయగలిగినంత పెద్దవి కావు. పక్షి తేలికగానున్న యెడల త్వరగా నెగురగలదు. కోడిశరీరభాగములయం దెక్కడ చలన ముండునో యచ్చట మాంసకండరములు తమ శరీరభాగముల కంటె బలిష్ఠములుగా నుండును. వీటిపైన పలుచని చర్మ మావరించుకొని లోని అవయవములను కాపాడు చుండును. దీని యుపరిభాగమందు ఈక లమర్చ బడియున్నవి. జంతువులకు వెండ్రుకలును, చేప లకు పొలుసులు నెట్లు శరీరమును కాపాడి దాని శీతోష్ణస్థితిని చక్కబెట్టునో యట్లే కోళ్ళకు ఈక లుపకరించును. ఒకడు ఒకజత గొప్ప రెక్కలను

చేయించి తన చేతులకు కట్టుకొనిన యెడల తాను గూడ పక్షులవలె నెగురవచ్చునని యనుకొనెను. ఒక యింటిపైనుండి ఈవిధముగా వాడు ఎగురుటకు ప్రయత్నించినప్పుడు క్రిందబడి దెబ్బలు తగిలెను. రెక్కల నాడించుటకు పక్షి భుజములలో విస్తారము బలము గలదు. మనిషియొక్క చేతులు పక్షులతో పోల్చినప్పుడు చాలాబలము తక్కువగా నుండును.

## ఈకెలు

ఇతరజంతువులకు లేనటువంటి ఈకెలు పక్షులకు గలవు. ఈ యీకెలు కొన్ని చిన్నవిగాను, మృదువుగాను నుండును. ఇవి కోళ్ళను యెల్లప్పుడు వెచ్చగా నుంచును. మరికొన్ని గట్టిగాను బలముగాను పొడవుగానునుండి ఎగురుట కుపయోగపడుచున్నవి. తక్కినభాగము పలుచని మృదువైన చిన్నచిన్న ఆకులవలన చేయబడియుండును. వీటి

చివరనుండు గరుకైన పండ్లవలన ఇవన్నియు ఆశ్చర్యముగా కలిసికొని ఒక్క ఈకలవలె నుండును.

## ఈకలలోని రకములు.

### రెక్క ఈకలు.

ప్రతి రెక్కయీకయందును నాలుగుభాగములు గలవు. అవి గొట్టము, బద్ద, కేశిక, సూక్ష్మ కేశిక అనునవి. గొట్టపుభాగము బలిష్ఠమైన వస్తువుచే నేర్పరుపబడినది. ఈభాగమే పాళీవలె చెక్కబడినచో వ్రాయుట కుపయోగించును. బద్దభాగముపైన స్నిగ్ధముగ నుండి అనుగున పొడవైన నొదను గలిగియుండును. దీని యంతర్భాగము బెండువలె నుండును. ఈ బద్దభాగమున కిరుప్రక్కలను కేశికలు గలవు. ఇవి వెడల్పుగను, పలుచగ నుండును. వీని కొకప్రక్క వంకర నరులవలెను, రెండవప్రక్క కొక్కెములవలెను వెడల్పుభాగమున కడ్డముగా నూగువంటి సూక్ష్మ కేశికలుం

డును. ఒక కేశికయొక్క పైభాగమందున్న యురూ
లవంటి సూక్ష్మకేశికలలో దానిప్రక్క కేశిక
యొక్క యడుగుభాగమందలి కొక్కములవంటి
సూక్ష్మకేశికలు తగులుకొని యుండుటవలన బద్ధ
భాగమున కిరుప్రక్కలను కేశికలసముదాయ
మొక యల్లినవస్త్రములవలె గన్పట్టును. ఈకోడి
ఈకకంటె కొంగఈకలో సూక్ష్మకేశిక లుండును.

## మూత ఈకలు.

ఇవి రెక్కయీకల గొట్టపు భాగములను కప్పి
యుంచుటచేత వీని కీపేరు వచ్చినది. ఇవి చిన్నవి
గా నుండును. శరీరమంతటను కప్పియుండును. చలికి
వేడికి సహించియుండుట కుపయోగకారిగా నుం
డును.

## తూలిక ఈకలు.

ఇవి చాలా చిన్నవి. శరీరమును మృదువుగను,
వెచ్చగను, మెత్తగను నుంచుటయేగాక దేహము

లోనికి చెమ్మ నినుకనీయవు. శీతలప్రాంతము నందలి జంతువులకు దట్టమైన యున్ని యెట్లుపచరించునో యట్లే వీని కీతూలికయీకలు శరీరములోని వేడిని పైకి బోనీయక, పై చలిని లోనికి చొరనీయక శరీరమును గాపాడుచుండును. ఈ యీకలన్నియును వెనుకభాగమున వ్రాలి యుండును. ఇట్లుండుటవలన పక్షి యెగురునపు డడ్డు కలుగనీయవు.

## —* ఈక లూడిపోవుట *—

కోళ్ళకు సామాన్యముగా సంవత్సరమున కొకసారి ఈకలూడిపోయి వానిస్థానే క్రొత్తవి యేర్పడుచుండును. ఈకలన్నియు నొకేసారి యూడిపోయినచో కొంతకాలము పక్షి బలహీనముగానుండును. కాన రెక్క లూడిపోక జతలు జతలుగ నూడుచుండును. అయినను కొన్నిజాతులలో నొకేసారి యూడిపోవుటయు కలదు. కోడి వెన్నుముక

చివరభాగమునందు నొకవిధమైన చము రుండును. కోడికంటె ఆకాశముమీద కెగురు పక్షుల కీచమురు ఎక్కువగా నుండును. ఈచము రుండుట వలన ఈకెలకు మెరుపు వచ్చును.

## —* కోడిముక్కు *—

కోడికి పండ్లులేవు. అవి యున్న యెడల వాటి తలకు చాల బరువుగానుండును. కఠినమైన గింజ లను తిని బ్రతుకు నిటువంటిపక్షులకు పండ్లవలె నుపయోగించు నొక దృఢమైన చర్మము కడుపు లో నుండును. ఈగింజలను పొడిచేసికొనుటకై కోళ్లు ఇసుకను, చిన్నచిన్న రాళ్ళను మ్రింగును. ముక్కు మనగోళ్ళవలెనే కొమ్ముతో చేయబడినది. ఇంకను కోడిముక్కు పొట్టిదిగను, పదునుగలదిగను, దృఢ మైనదిగను, సూదికొన గలిగినదిగను ఉండును. వాని నెంతమాత్రము బెదరించినను అవి తమ ముక్కుతో పోరాడుచుండును. ముక్కుచివర

సూక్ష్మముగ నుండును. ఈ కారణముచేతనే దాని ముక్కులో నీరునిలుచుట కవకాశ ముండదు గనుక అవి నీరుత్రాగునపుడు గొంతుక పైకెత్తి నీటిని కడుపులోనికి జారవిడుచును.

## —* అస్థిపంజరము *—

కోడియొక్క అస్థిపంజరము తేలికగా నుండును. తేలికయైన యెముకలచేత కోడి నిర్మింపబడిన యెడల కావలసిన బలము నిచ్చు మాంసకండరముల కాధారభూతము లగుటకు వలయునంత దార్ఢ్యము గలిగియుండవు. విస్తారము పనిచేయ గలుగుటకుబలమైన మాంసకండరములుండవలెను. బలమైన మాంసకండరములు నిలుపుటకు లావైన యెముక లుండవలయును. అట్టి లావైన యెముకలున్నచో బరు వెక్కువగును. కనుక కోడి భూమిమీద తేలికగా తిరుగుటకును, అవుసరమున్నపుడు యిండ్లపైకి, చెట్లపైకి ఎక్కుటకును తేలికగా

రెక్కల నాడించుటకును, మాంసకండరములను పట్టి యుంచుటకును బోలుయెముకలు పనికివచ్చునుగాని మరి యేవిధమైన యేర్పాటులు వీలుపడవు. కనుక ఎముకలుసర్వసాధారణముగా వలయునంత లావుగా నున్నను, గొట్టములవలె బోలుగానున్నందున తేలికగానే యుండును. మరియు వీటిబరువు నింకను తగ్గించగలుగుటకును, అవి ఎగురుటకు సులభమగు నట్లును యీ యెముకలలోని బోలుగానుండుస్థలములందు గాలి చేరుట కవకాశము లున్నవి. బోలుగానుండు యెముకలు లావుగానున్నను తగినబలము లేనివి కాకుండుటకుగాను ఈయెముకలతో సున్నము,భాస్వరము మొదలగు వస్తువులచే నిర్మింపబడి దృఢత్వము కలిగియున్నవి.

—* ఫుత్తె *—

ఫుత్తె యనుభాగము గుండ్రని యెముక పెట్టె. దీని ననుసరించి కొమ్మువంటి గట్టిపదార్థముచేత

యేర్పరుపబడిన ముక్కు యొకటి గలదు. నేత్రగోళ మిముడుటకు పుర్రెయొక్క యెదుటిభాగమున గుండ్రని చిప్పగలదు. ఇతర జంతువులకువలెనే వీటికిగూడ క్రిందదవుడమాత్ర ముండును.

## మెడభాగ మందలి యెముకలు

కోడి మెడభాగమందలి ఎముకలసంఖ్య మెడ యొక్క నిడివినిబట్టి యుండును. ఏవస్తువైనను పట్టుకొనుటకు వీలగునట్లు చేతులవంటి అవయవములు పక్షులకు లేవు. కనుక నవి యన్నిటిని సాధారణముగా ముక్కుతోనే పట్టుకొనుచుండును. కావుననే వీలయినంత పొడవును, కొంతవరకు వంచుటకవకాశము కలుగునట్లును మెడయెముక లేర్పడియున్నవి. అంతియేగాక తలను అన్నిప్రక్కలకును త్రిప్పుట కవకాశ మిచ్చులాగున పుర్రెభాగమునందు మెడయెముక లమరియున్నవి. ఈమెడ

యెముకలు వెన్నుపూసయొక్క పైభాగమని గ్రహింపవలెను.

—* వెన్నెముక *—

వెన్నెముకయొక్క యితరభాగముకూడ ననేకములైన చిన్నయెముకలచేత నిర్మింపబడి యున్నది. వెన్నుపూస మధ్యభాగమందలి యెముకలలో అనగా నడివెన్నుమీదివి సర్వసామాన్యముగా దృఢముగానుండును. కాని విశేషముగా నెగురక నేలమీదనే సంచరించుపక్షులలో కొంతవరకు వంగుచుండును. వెన్నుపూసయొక్క చివరభాగము అనేకమైనచిన్నయెముక లేకమై ఒక్కయెముకగా నేర్పడియుండును. ఈభాగమున కిరుప్రక్కల కాళ్లయెముక లతికించబడియుండును. ఈయెముకయొక్క అగ్రము ముక్కునబోలియుండి కొద్దిగా చలమునకు చోటిచ్చుచున్నది. ఈచివరయెముకమీదనే తైలగ్రంధులు గలవు. ఈ

అగ్రిమునకే తోకఈక లమర్చబడి యుండును.

—* ప్రక్క యెముకలు *—

పక్షులప్రక్కయెముకలు 6 మొదలు 12 జతల వరకు నుండును. ప్రతిప్రక్క యెముక యెదుటను నొకచిన్నని యెముకతో చేర్చబడియుండును. ఈచిన్నని యెముకలన్నియు ముందరివైపున బోర యెముక కతికించబడియున్నవి. మరియు నొక్కొక్క ప్రక్కయెముకయొక్క మధ్యభాగము నుండి వెలువడినశాఖయెముక దానికి వెనుకనుండు ప్రక్క యెముక యొక్క మధ్యభాగమున కంటించబడి యున్నది.

—* బోర యెముక *—

బోరయెముక వెడల్పును లోతును గలిగి పడవ కీలుయొక్క యాకారమును బొందియుండును. రెక్కల నాడించగలుగు పెద్దమాంసకండరములు యీయెముకకు ప్రక్కలను, యెదుటను అతికించ

బడియున్నవి. పై యెముకయొక్క కీలు బహు సూక్ష్మముగా నుండును.

—* రెక్కగూటి యెముక *—

మెడకొంకిభాగమునందు, అనగా మెడభాగము మొండెముతో జేరుచోట, నిరుప్రక్కలను మూడు జతల యెముకలు గలవు. వీనిలో నొకజత రెక్కగూటిఎముక; రెండవజత కొంకియెముక; మూడవ జతమాత్రమే పక్షులకు గలదు. ఇది కొంకికిని బోర యెముకకును సంబంధము కలుగజేయుచున్నది. రెక్కగూటియెముకలు యితరజంతువులకు వలె ముక్కోణాకారముగ నుండక సన్నముగాను పొడవుగాను నుండును. మూడవజతయెముకలు తక్కిన రెండుజతల యెముకలకంటె బలిష్ఠముగా నుండును. రెక్కలను క్రిందికికొట్టునప్పుడవి యొండొంటితో నిరుకుకొనక వానినాపుచేయునట్టిది యీమూడవ జతయే.

## —* చేతి యెముకలు *—

చేతులకు బదులుగా కోళ్ళ రెక్కలకు అవయవము లున్నవి. ఈరెక్కల కాధారములైన యెముకలితర జంతువులకువలెనే కొంతవరకు నేర్పడియున్నను కొన్ని మార్పులను గూడ బొందియున్నవి. భుజాస్థి పొట్టిగను, లావుగను నుండును. ముంజేతి యెముకలు రెండు గలవు. మణికట్టు ఎముకలు రెండు గలవు. అరచేతియెముకలు రెండును ఏకముగా నేర్పడియున్నవి. కటికయెముక యొకటిగానుండి వెన్నుపూసయొక్క చివరభాగముతో గట్టిగా నతుకబడి యున్నది.

## —* కాళ్ళయెముకలు *—

మనుష్యుల కాళ్ళును, కోళ్ళకాళ్ళును ఒకేవిధమైన యెముకలు గలిగియున్నవి. కాని అవి ఒక తీరుగా నుండవు. పక్షులు తమకాళ్ళను ముడుచునప్పుడు వ్రేళ్ళుగూడ ముడుచుకొనునట్లుగ

వాటికాళ్ళు చేయబడినవి. మనము ఒక కోడి నడుచుచున్నపుడు చూచినయెడల నది వేసెడు ప్రతి అడుగునకు దాని వ్రేళ్లుకూడ, భూమిపైకి యెత్తినప్పుడు, ముడుచుకొనుటమాత్రము చూతుము. పక్షి నిద్రించునపుడు చెట్టుకొమ్మను గోళ్ళతో పట్టుకొనును; గనుక అది క్రిందికి పడి పోజాలదు. భూమిని పెకలించి ఆహారమును సంపాదించుకొనుటకు కాళ్ళు దృఢముగా నుండవలెను. వ్రేళ్ళు పొట్టిగాను దళముగాను నుండును. గోళ్లు లావుగా మోటుగా నుండును. భూమిని పెకలించుటవలన అరిగిపోయిన గోళ్లు తిరిగి కొద్దికాలములోనే పెరుగుచుండును. ఒక్కొక కాలికి నాలుగుగోళ్లుండును. వీనిలో మూడు ముందరివైపునను, ఒకటి వెనుకప్రక్కను నుండును. వెనుకవైపున నుండు వ్రేలులో రెండెముకలును, ముందరివైపున నుండు మూడు వ్రేళ్లలోను

లోపలితట్టుదానికి మూడెముకలును, దానిప్రక్క వ్రేలునకు నాలుగుయెముకలును, కొనవ్రేలునకు అయిదు యెముకలును ఉన్నవి. ఇతరజంతువులకు వలె పక్షులకు గూడ తొడయెముక ఒకటి, ముంగాలి యెముకలు రెండును నుండును. చీలమండ ఎముకలును, అరకాలిఎముకలును గూడ గలవు.

## —* జీర్ణకోశము *—

మనుష్యునియందు జీర్ణకోశము ఒక్కటియే. నెమరువేయుజంతువులలో నీకోశము నాలుగు తిత్తులుగా నుండును. కాని కోళ్లయందు రెండు తిత్తులుగ నుండును. వీనియందు మొదటిది జాఠరిక రసమును తయారుచేయు గ్రంధులను కలిగియుండుటచే ముఖ్య జీర్ణకోశ మనిపించుకొనును. రెండవ కోశమునందు దళసరియైన మాంసకండరములచే నిర్మింపబడిన గోడలు గలిగియుండును. వీనిలో పలిప్రతిభాగము కఠినముగను, కొమ్మువంటి పొలు

సులు గలదిగను ఉండును. ఇంకను చిన్న చిన్న గులకరాళ్లుకూడ నుండును. ఇచ్చటనే ఆహారము పెరుగుచిలికినట్లు చిలుకబడును. మాంసకండరముల సూక్ష్మమైన అరలకు గోడ లుండవు. ఒకవేళనున్నను ఆగోడలు సులభముగా జీర్ణముకాబడు వస్తువులచేత .నిర్మించబడి యుండును. గింజలు కాయలు మున్నగు వృక్షజాతిసంబంధమైన పదార్థములయరలకు కఠినతరములైన నున్నము మున్నగు వస్తువులచేత నిర్మితములై కష్టజీర్ణితములగు గోడ లుండును. కావున నవి జీర్ణములగుటకు మెత్తగ పిండివలె చితుకగొట్టబడవలయును. ఈపని జంతువులలో నోటిపండ్ల మూలమున జరుగును. పక్షులన నోళ్ళలో దంతములు లేకుండుటవలన శాకభుక్కులు తమ రెండవయన్నాశయములోనికి గులకరాళ్లను మ్రింగుచుండును. ఈ రెండవ కడుపులో నాహారము చిలుకబడినప్పుడు ఆహార

ద్రివ్యములందు గలకరాళ్ళనడుమబడి మెత్తగ నలుగ గొట్టబడును. కావున జంతువుల నోటిపండ్లు జరుపు పని పక్షులు తమ రెండవకడుపులో గులక రాళ్ళమూలమున జరుపుకొనుచున్నవి. ఈ విష యమును తెలుపుటకొరకే కొందరు శాస్త్రజ్ఞులు పక్షులకు కడుపులో పండ్లున్న వని విచిత్రముగ చెప్పుచుందురు.

## —* కాలేయము *—

అన్నాశయభాగమునుండి పేగులు వెలువడు చోటనే కాలేయములో దయారైన పైత్యరసము, దానిలోనుండిగాని లేక యిదివరలోనే యది చేరి యున్న పిత్తరసాశయము లేక చేదుకట్టులోనుండి గాని బయలుదేరి గొట్టముగుండా వచ్చి పేగులలో బడును. మరియు వృక్కాకములో దయారైన మధుర రసముకూడ చిన్నగొట్టములోగుండా బ్రవహించి యచ్చోటనే ప్రేగులలో జేరును.

—* ఆంత్రాంతము *—

ఆంత్రాంత మను యనయవభాగము మలము, మూత్రము, గుడ్లు బయటకు వచ్చుటకుమార్గమైయున్నది. వెన్నెన కిరుపార్శ్వములయందున్న పొడుగైన మూత్రకోశములలో రక్తము నుండి మూత్రరసము వెలువరింపబడి రెండు సన్నని గొట్టములగుండా బ్రవహించి ఆంత్రములో బడును. ఈ కారణముచేతనే పక్షులు రెట్టలు వేయునప్పుడు మలమూత్రము లొక్కసారియే కలిసి బయటపడును. మరియు ఆంత్రాంతమున కిరు ప్రక్కలయందును రెం డవయవయవవిశేషములు కొంచెముపొడవైనవి కలవు. వీనినుండి బయటకి గొట్టమే లేదు. ఇవి పక్షుల కెట్లుపకరింనోచు శాస్త్రజ్ఞుల కింతవరకు దెలియకున్నది.

## —* ఆహారమును జీర్ణింపజేయురసములు *—

| పేరు | తయారగుచోటు |
|---|---|
| ఉమ్మినీరు | నోటిలోనిగ్రంథులు |
| జాఠరికరసము | కడుపుగోడలోని గ్రంథులు |
| పైత్యరసము | కాలేయములోని గ్రంథులు |
| మధురరసము | వృక్వకములోని గ్రంథులు |
| ఆంత్రరసము | పేగుల గోడలలోని గ్రంథులు |

## —* హృదయము - రక్తప్రసరణము *—

జంతువులకువలెనే కోన్కుగూడ గుండెకాయకు నాలుగుఅరలు గలవు. పైన కర్ణికలును, క్రిందివి రెండును జఠరికలును శరీరభాగములన్నిటికి ధమనులగుండా వ్యాపించి శరీరభాగములను పుష్టిచేయును. ఇంకను అరిగిపోయిన శరీరభాగమునుండి విషద్రవ్యములను రక్తము గ్రహించి దానితో మలినమై సిరలగుండా కుడికర్ణికలో జేరును. దానినుండి కుడిజఠరికలోనికి వచ్చి యచ్చటినుండి శ్వాసకోశ

ములలోనికి ప్రవేశించి యచ్చట పరిశుభ్రపడును. మరల తిరిగి శుద్ధరక్త మెడమకర్ణికలో బడును. తరువాత నెడమజఠరికలో ప్రవేశించి తుదకు ధమనుల గుండా శరీరభాగములకు పోవును. జంతువులలో కంటె స్వభావముగా పక్షులకు చలన మెక్కువగా కావలయును. ఇట్లుండుటవలన శరీరభాగము యొక్కువ యరగిపోవుచుండును. అవి యెక్కువగా మరమ్మతులను గోరును. కావున రక్తప్రసరణము పక్షులలో జంతువులకంటె నెక్కువతీవ్రముగా జరుగును.

## —* ఊపిరితిత్తులు - శ్వాసపీల్చుట *—

ఇతరజంతువులకంటె సామాన్యముగ కోళ్లలో శ్వాస ఎక్కువ తీవ్రముగా జరుగుచుండును. ఈ కారణముచేతనే రక్తములో జేరిన మలినపదార్థము లెక్కువ వేగముగ భస్మీకరణము నొందుచుండును. కావుననే జంతువులవలెగాక పక్షులశరీరమందలి యుష్ణము హెచ్చుగా నుండును. విషద్రవ్యముల

భస్మీకరణ మింత మిక్కుటముగా జరుగుట కింకొక కారణము గలదు. జంతువులు సాధారణముగా బీల్చుకొనుగాలి వానిశ్వాసకోశములయందు మాత్రి మిమిడియుండును. కాని పక్షులశరీరములలో యీవాయువు ఎముకలగుల్ల భాగములందును, శరీరమంతటను వ్యాపించియున్న గుల్లతిత్తులయందు నుండును. పక్షులు తేలికగా నుండుటకుగాను యిట్టి యేర్పాటుచేసికొని వానిశరీరమంతయును వీలున్నంతవరకు వాయుపూరితముగ జేసికొనును. కాబట్టి పక్షులలోని రక్తము జంతువులలోని రక్తముకంటె నుష్ణతరముగా నుండుట కిదియే ముఖ్యకారణము. వాటిశ్వాసకోశములు జంతువులలోని వానివలె గోధుమరంగు గలిగినవిగాక మంచి యెరుపు రంగు గలిగి స్పంజివలె నుండును. ఇవి రెండు వైపులను రొమ్ముభాగమునకు వెనుకవైపున అమర్చబడియున్నవి. మరియు జంతువులవక్షస్థల

మునందు హృదయమునకును, జీర్ణాశయకుహరము నకును మధ్యమాంసకండరములచే నిర్మింపబడిన డైయాఫ్రం (అడ్డుగోడ) క్రోళ్ళలో నుండదు.

---

# నాలుగవ భాగము.

—* గ్రామాదులలో రైతులుచేయుపనులు *—

పల్లెలలోనుండు రైతులలో చాలమంది గ్రుడ్లకొరకు, పందెములకొరకు కొన్నికోళ్ళను పెంచుదురు. వారికి వీటిని పెంచుపద్ధతులు సరిగా తెలియక తమ యిండ్లదగ్గరనే ~~చాల అసహ్యకరముగ~~ నుంచుదురు. కొందరు స్త్రీలు గ్రుడ్లను అమ్మి డబ్బు సంపాదించవలె నను కోరికతో రెండు మూడు పెట్టలను కొని తమయింటిలోనే పెట్టి పెంచుదురు. ఇట్లు పెంచుటవలన అవి యిండ్లలోనే రెట్టలు వేయుట, మనము తిను ఆహారములలో మూతులు పెట్టుట, చంటిపిల్లలెవరైన యున్నయెడల వారి మంచములు యెక్కి కూర్చుండుట, యెవరైన పెద్ద మనుష్యులు వచ్చినపుడు గొప్పపెండ్లివలె సందడి చేయుట మున్నగునవి జరుగుచుండుట మన కంద

రకు తెలిసినవిషయములే. ఇండ్ల దగ్గర కోళ్ళుండుట చాల నష్టము. పెంటకుప్పలు, పశుశాల, పశువు లుండు దొడ్లలో ఇవియున్న అంత నష్టములేదు గాని కేవలము వాటిని యిండ్లలో పెట్టి పెంచుట చాల విచారకరము. వీటిని పెంచువారు తమ యిండ్లకు దూరముగానుండు దొడ్లలోనుంచి పెంచ వలెను. ఇండ్లదగ్గర పెంచబడుకోళ్ళు తదితర దగ్గర యిండ్లలోనికి దొడ్లలోనికి పోయి పేడ నటు నిటు త్రోయుట, పశువుల ముక్కులలో పొడుచుట, వంటయిండ్లలోనికి పోయి పాత్రిలలో మూతులు పెట్టుట మున్నగునవి జరుగుచుండును. అప్పుడా పొరుగిండ్లవారు ఆకోళ్ళుచేయు పనులు చూచి విసిగి కాళ్ళు విరుగగొట్టుట, గడ్డలతో గొట్టుట, వీలుగా నున్న చంపి తినుట మున్నగునవి జరుగుచుండును. కోళ్ళయజమానులు పొరుగువారు నీ కోళ్లను గురించి అసూయలు పెరిగి పోరాడుకొనుటకుకూడ

సిద్ధమగుదురు. కాన కోళ్లను పెంచువారు వాటిని ప్రత్యేకస్థలములలో నుంచి పెంచుట చాలమంచిది. లేనియెడల ఆ కోళ్లయొక్క యుసురు మీకు తగులును.

పశువులదొడ్డిలో కోళ్ళగూళ్లు నుంచరాదు. అట్లుంచుటవలన వాటికి పట్టు పేలన్నియు దూడలకు పెద్దవాటికి పట్టి బాధించును. ఇంకను గోడలకు కట్టుకొయ్యలకు తలుపులకు పట్టి మనుష్యులకు కూడ పట్టును. కాబట్టి వాటిని ప్రత్యేకస్థలములందుంచి పెంచగలందులకు నేను తా మెల్లరిని ప్రార్థించుచున్నాను.

## —* కోళ్ళ గూళ్ళు *—

కోళ్లకు అగ్నిభయములేకుండ నుండునట్టి పెంకు కప్పుతో గూళ్ళుకట్టుట మంచిది. అవి మంచి వెలుతురు గాలి వచ్చునట్టివిగా నుండవలెను. కోళ్లకు గచ్చుచేయబడిన గూళ్ళుండవలెననికొంద రభి

ప్రియపడుచుందురు. గచ్చుచేయబడిన గృహ
ములు పరిశుభ్రముగ నుండుననుట నిజమేకాని
గచ్చునేలమీదకూడ ఆకులనుగాని గడ్డినిగాని
పొడిమట్టినిగాని పోసియుంచవలెను. కోళ్లు తమ
రెట్టలను దీనిమీద విడిచిపెట్టబడినపుడు అవి
యందు గలసిపోయి గూళ్ళు శుభ్రముగా నుండును.
మరియు నందు వేయబడిన చెత్త మొదలగునవి
తొలగించుచుండవచ్చును. ఇట్లు చేయుటవలన
పక్షు లారోగ్యము గలిగియుండును. గచ్చుతోచేసిన
గూళ్ళకంటె పేడతో నలుకబడిన మట్టిగూళ్లే
కోళ్ళకు మంచివి. వారమున కొకసారి గూళ్ళను
శుభ్రముచేయుచుండవలెను. సంవత్సరమున కొక
సారి గూళ్లను మరమ్మతు చేయించు చుండవలెను.
గూళ్లముందు గోతులుగాని, పడిపోవు గోడలుగాని
యుండరాదు. ఇంకను పశువులను గూళ్లదగ్గర కట్టి
వేయరాదు. ఇంకను గూళ్ళను దూరముగానుండు

పొదలలోగాని, రక్షసపొదలలోగాని నిర్మించ రాదు. గూళ్ళు మిట్టపల్లములుగా నుండుటయే మంచిది. కోడిని స్వతంత్రముగా గుడ్లను పెట్టుకొను చోటునేర్పాటు చేసికొననిచ్చిన యెడల నదిభూమిని గుంటనుజేసికొని యందు గుడ్లుపెట్టును. ఈగుడ్లు గుంటనడుమజేరి పొదుగుట కనుకూలముగా నుండును. కాబట్టి కోళ్ళగూళ్ళు యిట్టి యాకారమునే గలిగి యుండవలెను.

కోళ్లగూళ్లనుంచు తలుపులు మిగుల బలముగానుండి రంధ్రములుగల యినుప జల్లెడలను అమర్చవలెను. ఇట్లమర్చినయెడల గాలి ధారాళముగా వచ్చుచు పోవుచునుండును. ఇంకను గూళ్ల ప్రక్క సందులులేకుండ మూయవలెను. గూళ్లను ఉదయ సాయంకాలములందు పరీక్షించుచుండవలెను. ఉడుము, ఎండ్రకాయ, జంగురుపిల్లులు, మున్నగు దుష్టజంతువులు లోపలికి పోయి దాగి

వాటిని పట్టుకొని తినును. కాబట్టి జాగ్రత్తగా గూళ్లను కాపాడు చుండవలెను. అప్పుడప్పుడు గోమారులు, పేలు, మిన్నల్లులు పట్టుచుండును. అట్టి సమయములలో ఫినైల్ లోషన్‌తోగాని, కార్బాలికు లోషన్‌తోగాని పరిశుభ్రము చేయుట మంచిది. ప్రతిసంవత్సరము సంక్రాంతి పండుగకు మనయిండ్లకెట్లు సున్నము కొట్టించెదమో యట్లే ఈకోళ్ల గూళ్లకుగూడ సున్నము కొట్టించవలెను. గూటిలో 20,30 కోళ్లకు సరిపోవు గదు లేర్పర చుట మంచిది. ఆగది పెట్టకు విశాలముగా సరిపోవు నంతటి స్థల ముండవలెను. గూళ్లలోపల వర్షము కురియుచున్నది లేనిది పరీక్షించుచుండవలెను. పరి శుభ్రమగు గాలి కోడిశరీరారోగ్యమునకు ముఖ్య ముగ కావలసియున్నదిగాన దానిని డబ్బుపెట్టి కొననక్కరలేదు. అది అన్నిచోట్లను యెల్లప్పుడు సమృద్ధిగా వీచుచుండునుగాన యాగాలిని గూళ్ళ

లోనికి వచ్చుచుండునట్లు చేయవలెను. గాలి రావిలులేకుండను, ఉక్కగానుండు గూళ్ళలో నివసించి నపక్షులు చాలభాగమునకు బలహీనత, రక్తహీనత, నిస్సత్తువ మున్నగువ్యాధులవలన తరచుగా బాధపడుచుండును.

## కోళ్ళ ఎరువు

కోళ్ళను పెంచువారు కోళ్ళవలన గ్రుడ్లవలన కాక మరియొకవిధముగా లాభమును బడయవచ్చును. కోళ్ళనుంచిన భాగమున మంచిఎరువు లభించుచుండును. ఈయెరువు పంటలను పండించుటకుకూడ పనికివచ్చును. పదివందలకోళ్ళపెంటను క్రమముగా నష్టములేకుండ జాగ్రత్త చేసిన యెడల సంవత్సరమునకు 60 పౌనుల విలువగల పెంటవచ్చునని తెలియుచున్నది. ప్రతిపక్షియొక్క పెంటలో సగమైనను జాగ్రత్తచేయబడినయెడల సంవత్సరమునకు పక్షి 1కి 30 పౌనుల తూనికగల పెంట

వచ్చును. కోళ్ళపెంటను ప్రతిదినము పోగుచేసి నైట్రోజను నష్టముగాకుండ జేయుపదార్థములను జాగ్రత్తచేయవలెను. ఎరువు నెక్కువ శ్రేష్ఠమైనదిగా జేయుటకు దానికివలయునంత పొటాషును భాస్వరామ్లమును చేర్చవలెను. ఈ ఎరువు చాల మంచిది.

## కోళ్ళవయస్సు కనుగొనుట

ముదురుకోళ్ళచర్మము తెలుపుగనుండి రక్తనాళములు లేకయుండును. అందు ఈకెలు గానరావు. పొడుగుగల పట్టువంటి మెత్తని యీకెలు చిన్నకోళ్ళకేగాని పెద్దకోళ్ళకుండవు. ఒకసారి గుడ్డుపెట్టిన వెనుక యీ మెత్తనిపట్టువంటి ఈకెలు ముదిరిపోవును. పెట్టలరెక్కలను విప్పి చూచినప్పుడు ఈకమొదళ్లు కలియుచోట యెరుపురక్తనాళములు కనబడినయెడల అవి సంవత్సరములోపు పిల్లలని తెలిసికొనవలెను. సంవత్సరము

దాటిన యెడల ఈయెరుపురక్తనాళికములు రెక్కలలో కన్పట్టవు. కాలిగిట్టలు చిన్నకోళ్లకు మెత్తగను, పెద్దవానికి బిరుసెక్కి గీతలుపడి గట్టిగను, ముదురుగను ఉండును. మరియు కోడి పెరిగినకొలది కాలిపెద్దవ్రేలు గోరు అరిగి పోవును.

కోడిగ్రుడ్డులోని భాగములో నొక్కొక్కప్పుడు నెత్తురుచుక్కలు కనబడును. తల్లిగర్భములో నేదయినపుండువున్న యెడల దీనివలన తెలియును. గ్రుడ్డులోపలభాగమున నల్లనిమచ్చలు కనపడిన యెడల పెట్టకేదోవ్యాధికలిగినదనిగ్రహించవలెను.

## —♦ ఆహారము ♦—

వివిధ దేశములందు కోళ్లకు నాహారముగా నుపయోగించు పదార్థములు వివిధరకములుగా నుండును. ఆయాపదార్థగుణములు ఆయూదేశముల యొక్క శీతోష్ణస్థితినిబట్టియు, ఆయాకోళ్లుచేయు పనులను బట్టియు మారుచుండును. పిల్లలుగానుండు

వయస్సులో దేహముయొక్క వివిధ భాగములను వృద్ధిచేయుటకును, కోడి బ్రతికియున్నంత కాలము పుష్టినికలుగజేయుటకును, దేశ వ్యాపారములకు సాధనములుగా నుండుటకును, ఆహారముప యోగపడుచున్నది. పక్షులకు బెట్టుఆహారములో గొంచెము ఉప్పునుకూడ కలిపిపెట్టుచుండవలెను. ఉప్పువేయుటవలన అజీర్తిమున్నగువ్యాధుల గలుగనీయక జీర్ణశక్తిని వృద్ధిచేయును. బాగును, పచ్చియాహారము కోళ్లకు మిగుల యారోగ్యకరములగునవికనుక వాని నెక్కువగా పెట్టుచుండవలెను. తవుడులో వెన్నపూస కలిపిపెట్టిన కోళ్లు బాగుగా బలియును. ఇంకను ఉల్లికాడలు, ఉల్లిపాయలు, ఉల్లిపొట్లు కూడ మంచిఆరోగ్యమైన అహారమై యున్నది. వీటివలన కోళ్లకు ఆరోగ్యముకలుగును. గుడ్లుపెట్టుకోళ్లకు తవుడు, ఓటుధాన్యము, పచ్చిమేత మున్నగునవి పెట్టుచుండినయెడల విశేష

ముగా గ్రుడ్లు పెట్టుచుండును. కోళ్లకు అందియు అందనట్లుగ క్యాబేజిపువ్వులనుగాని, కాయలను గాని వ్రేలాడగట్టినయెడల అవి ఎగిరి అందుకొని కొరికితినుచుండును. ఇట్లుచేయుటవలన వానికి ఆహారము లభించుటయేగాక తగినశరీరపరిశ్రమగలిగి మిగుల ఆరోగ్యకరమైయుండును. గుడ్లుపెట్టు కోళ్లకు ఎముకలను మేపుటవలన మిగుల క్రొవ్వు పట్టి బాగుగా బలియును. మాంసకరపదార్థములు పెట్టినయెడల శరీరమునకు కండపుష్టికలుగును. కోడి శరీరఉష్ణమును కాపాడుటకు క్రొవ్వుచమురు అవసరము. శరీరముయొక్క చురుకుదనమునకు పంచదార కావలయును. ఈకెలనిర్మాణమునకు భాస్వరము, సున్నముకావలెను. పేగులలో జీర్ణశక్తికి సహాయపడుటకు నారవంటిపదార్థము కావలెను.

వరి, మొక్కజొన్న, జొన్న మున్నగుధాన్యములు కోళ్లకుమామూలుఆహారములై. మొక్కజొ

న్నలనిన కోళ్లకు మిగులప్రీతి. కాని విస్తారముగా మొక్కజొన్నలు తినుకోళ్లు క్రొవ్వెక్కి బలియుచుండును. పెట్టలైన క్రొవ్వెక్కి గుడ్లను బెట్టజాలవు. అందువలన వీటిశరీరమునకు హానిచేయకుండునట్లు తగినంతగా బెట్టవలెను. బఠానీలుకూడ మంచి యాహారమే. ఇంక నానావిధములైన పురుగులను కూడ కోళ్లుతినును. అవికూడచాలమంచివియే. జంతువుల నురుగుదబ్బల నుడక బెట్టి ముక్కలగా కోసి పెట్టుటకూడ మంచిదియే. సన్నని పచ్చియెము కలుగూడ నవి తినును. గోధుమనూకగాని, వరి నూకగాని తవుడులోకలిపి అప్పుడప్పుడు పెట్టుట కూడ మంచిది. బంగాళాదుంపలు, పప్పుదినుసులు, ప్రత్తిపిండిమున్నగునవికూడ కోళ్లకు పెట్టవచ్చును.

వేళలప్రకారము ఆహారముపెట్టుట

—* ఉదయము *—

మొదటిఆహారము ప్రతిదినము ఉదయము $7\frac{1}{2}$ గంటలకు కోళ్లకు పెట్టవలెను.

తవుడు    ఒక భాగము
నూకలు    రెండు భాగములు

కలిపిపెట్టవచ్చును. పొట్టుధాన్యములు దొరికినయెడల కూడ పెట్టవచ్చును. మాంసాహారము నూరుపక్షులకు ముప్పావుపౌను పెట్టవచ్చును. తవుడు గోధుమపొట్టును మాంసముతో కలిపి పెట్టుట మంచిది. శీతాకాలములో పెట్టుఆహారము వేడినీటితో కలిపిపెట్టవలెను. వేసవికాలములో చన్నీళ్లతో కలిపిపెట్టవలెను. పక్షులకు వాటి యాకలినిబట్టి తగినంతయాహారము పెట్టవలెను. ఒక్కొక పక్షికి 10లేక 12 తులముల ఆహారముపెట్టవలెను. ఆపెట్టినయాహారము పావుగంటలో తినవలెను. అట్లుతినక మిగిలియున్న ఆహారము తీసివేయవలెను.

## —* మధ్యాహ్నము *—

ప్రతిదినము మధ్యాహ్నము 12 గంటలకు పెట్టవలెను. ఒక్కొకపక్షికి 5 తులములవంతున

ఆహార మీయవలెను. ఈ యాహారము పచ్చిదిగా నుండవలెను. ఇంక నెక్కువ యాహార మవసర మని తోచిన ఈయవచ్చును. పచ్చియాహారములో జీర్ణశక్తి రక్తవృద్ధి కలుగుగుణము కలదు.

—* సాయంకాలము *—

ప్రతిదినము సాయంకాలము $5\frac{1}{2}$ గంటలకు మూడవ ఆహార మీయవలెను. ఈ యాహారము ధాన్యాదులై యుండవలెను. గోధుమనూకగాని, వరినూకగాని, బఠానీనూకగాని పెట్టవలెను. కోళ్ళకు వేయు ఆహారము దేని కెంత వేయవలయునో విచారించి వేయవలెను. కొన్ని అధికముగ తినును. మరికొన్నిటికి చాలనే చాలదు. కాబట్టి దేని కెంత వేయవలెనో పరీక్షించి పెట్టుట మంచిది. బొగ్గు, ఇనుము, ఎప్సన్‌సాల్టు, గంధకము మున్నగువస్తువులు ఆహారములో కలిపి పెట్టుట మిగుల మంచిది.



కోడిపిల్లలకు పచ్చిమేతయుంచు సంచి.

పదార్థ...
లకుకూడ పై...

## —* మూడు నాలుగు ... —

ఈ వారములలో మృదువైన ఆహారము ఉదయము 9 గంటలకు పెట్టవచ్చును. సాయంకాలము 6½ గంటలకు పై మిశ్రమపదార్థములు పెట్టవలెను. పిల్లలు నాలుగువారముల వయస్సు వచ్చినప్పుడు వారిని 40 పిల్లలవంతున సమూహముగా జేర్చి అటు నిటు తిరుగుచుండవలెను. ఎనిమిది మొదలు 16 వారముల వయస్సుగల పిల్లలకు ప్రతిదినము 7 గంటలకు ఆహారము పెట్టవచ్చును.

## —* నీటితొట్లు *—

కోళ్లకు పుష్టికలుగుటకు చాల ముఖ్యముగా కావలసిన పదార్థములలో నీరుకూడ నొకటియై యున్నది. శుభ్రమైననీటిని చిన్న చిన్న తొట్టె

గించు

పట్టు ఆహారము.*

## మొదటివారములో

పిల్లలుపుట్టిన మొదటివారములో నీ క్రింది వాటిని కలిపి పెట్టవచ్చును.

| | |
|---|---|
| గోధుమనూక | 60 పాళ్ళు |
| జొన్ననూక | 15 పాళ్ళు |
| మాంసము | 10 పాళ్ళు |
| మొక్కజొన్ననూక | 5 పాళ్ళు |
| వరినూక | 5 పాళ్ళు |

కలిపి పెట్టవలెను. చాలినంత నీరు త్రాగించవలెను.

## రెండవవారములో

ఉదయము 9 గంటలకు ఉడుకబెట్టిన గుడ్లు పెట్టవలెను. ఒంటిగంటకు పైనచెప్పిన మిశ్రమ

లలోనుంచి గూళ్ళలో పెట్టుట మంచిది. అట్లు పెట్టినయెడల వాటి కిష్టమువచ్చినప్పుడెల్ల త్రాగుచుండును. గూళ్లలోపలిభాగమున గచ్చుచేసిన గుంటలున్నయెడల వానిలోగూడ పోయవచ్చును. కాని పైతొట్లవలె శ్రేష్ఠముగా నుండవు. మురికి నీటిని బైటపోయుటకు వీలుండదు. ఊడ్చునపుడెల్ల నలకలన్నియు నా నీటిలో పడును. కాబట్టి తొట్లే చాలమంచి వని గ్రహించవలెను. చల్లనినీటిని చక్కగా కడిగిన యా తొట్లలో నుంచి వాటి కందుబాటుగా నుంచవలెను. ఇవి త్రాగునీటిని మంచులోగాని, ఎండలోగాని పెట్టరాదు. మురికినీటిని త్రాగనిచ్చినయెడల రోగములు పుట్టును.

---

# అయిదవ భాగము

---

## —* కోడిగుడ్డు నిర్మాణము *—

కోడిగుడ్డు కొంచెము పొడుగుగా నుండి గుండ్రముగనుండును. దానిరూపమునకు గుడ్డని పేరు. గుడ్డున కొక మొనకంటె మరియొక మొన వెడల్పుగా నుండును. పండ్లకు పైకప్పుగా నుండుతోలు వలెనే గుడ్లకును చిప్పయనునది పైమూతగ నుండును. ఆచిప్పకు లోపలిభాగమున ఎండిన ఉల్లిపొర వంటిపొర యొకటి యుండును. దీనిలోపల తెల్లని ద్రవమును పచ్చనిద్రవమును చేరి నిండియుండును.

## —* గుడ్డుపైనుండుచిప్ప *—

ఇది తళతళ మను తెలుపురంగు గలదిగానుండును. మరియునదినునుపుగనుండును. అది స్పృశించుటకు కఠినముగ దోచినను సులభముగ తునకలై

పోవును. చిప్పయందంతటను సూక్ష్మరంధ్రము లుండును.

## —* తోలు *—

ఇది మిక్కిలి సూక్ష్మమైనదిగను, తెలుపురంగు గలదిగను ఉండును. ఇది యుండుటచేతనే లోపల నుండు తెలుపుద్రవము చిప్పకు నంటుకొనకుండ యుండును.

## —* లోపలనుండు ద్రవములు *—

గుడ్డు పచ్చిగా నుండునప్పుడు దానిలోని తెలుపుద్రవము నీటివలె రంగులేనిదిగను బంక వంటి పసిమిగలదిగను, రుచిలేనిదిగను ఉండును. ఉడకబెట్టినపు డది గట్టిపడి తెలుపురంగుగలదిగను ఘనపదార్థముగను వేఱుపడును. దానిలోపల పసుపుద్రవముకూడ నుండును. పచ్చిగుడ్డునకు కొంచెము రంధ్రముచేసి వంచునపుడు తెల్లనిద్రవము నీళ్ళయందు నానబెట్టినబంకవలె కారును. కాని

పసుపుపచ్చని మట్లుగాక బంతివలె నొక్కసారిగ పడి పోవును. పసుపుపచ్చనమునం దొకవిధమైన వాసన గలదు. గ్రుడ్డును కొంచెము సేపు ఉడకబెట్టినయెడల తెలుపుపచ్చనము వేరుకానును. పచ్చనిదిమాత్రము గట్టిపడకుండ నుండును. మరికొంచెము సేపు ఉడక బెట్టినయెడల పసుపుపచ్చనము గట్టిపడును. అప్పుడు దానిని అదిమినట్లయిన పొడిపొడిగా పడును.

## —* గ్రుడ్లను పరీక్షించువిధము *—

నీళ్లలో గ్రుడ్లను వేసినపుడు మంచిగ్రుడ్లు మునుగును. చెడిపోయినగ్రుడ్లు తేలును. చిప్పలో రంధ్రము లుండుటచేత లోపలనుండు తెలుపుద్రవములోని నీళ్లు క్రమక్రమముగా నావిరియై పైకి లేచిపోవును. అందువలన పైనుండుగాలి లోపల చేరియుండును. గాలితోనుండుగ్రుడ్డుకనుకనే నీటిలో తేలును. క్రొత్త గుడ్లును చెడిపోవనిగ్రుడ్లును తెల్లనిద్రవమును పూర్తిగా కలిగియుండుటచేతనే నీటిలో మునుగును.

అందువలననే గుడ్లను ఉప్పుతో కలిపిపెట్టి చెడిపో కుండునట్లు చేయుదురు. చిప్పలోనుండు ద్వారముల నిట్లు మూసియుంచినప్పుడు లోపల నీరుతగ్గదు. గుడ్లు చెడవు. ఇట్లు కాపాడబడినప్పుడు ఆరునెలల వరకునుగూడ గుడ్లు చెడకయుండునని చెప్పుదురు.

—* గుడ్లను పరీక్షించు యంత్రము *—

కోడిగుడ్లను పొదిగించుటకై కొనువారు పరీక్షించుట కొక యంత్రము గలదు. ఈ పనిముట్టు వలన మూడు విధములైన గుడ్లను పరీక్షించ వచ్చును.

—* మొదటి రకపుగుడ్లు *—

ఈరకపుగుడ్లలో జీవముండనేయుండదు. వీటిని గొడ్డుబోతు గుడ్లందురు. మొన క్రిందవైపున కుండునట్టి గుడ్లను వెలుతురులోపెట్టి చూచునపుడు లోపలిభాగమంతయు పరిశుభ్రముగానే యుండి అద్దమువలె నాల్గువైపులకును కాంతి పోవు

చు, తగ్గు చుండును. కాంతితగ్గక ముద్దగానే వెలుతురు ప్రసరింపని తావులులేకయుండు గుడ్లు జీవములేకయే పుట్టిన వని తలంపవలయును. ఇంకనవి యెన్నడును పొదిగి పిల్లలు కావని మనము తెలిసికోవలెను. పుంజులు తగినంత శ్రద్ధలేనివైయున్నపుడును, ఆడుపిట్టలు మంచివాని నిదివరకే పెట్టినందువలనను, ఎప్పుడు బద్ధకము హెచ్చియుండునో అప్పు డిట్టిస్థితి తప్పక తటస్థించును.

## —* రెండవ రకపు గుడ్లు *—

కోడి ఈగుడ్లుపెట్టిన మూడు నాలుగు దినములవరకు నందు జీవముండును. తరువాత గుడ్డునకు శీతలము సోకును. పెట్ట గుడ్లను పొదుగునప్పుడు యేకారణమువలననైనను గుడ్లకు వేడి తగులకున్నచో నిది సంభవించును. అప్పుడు గ్రుడ్డునందలి జీవపదార్థము ఒకప్రక్కకు పోయి మురుగును. దానిని పగులగొట్టినయెడల దుర్వాసన

కొట్టుచుండును. కొందరు ఈగుడ్డుదోషమే దీనికి కారణమని తలంతురుగాని, ఇదిగుడ్లను పొదుగు పెట్టయొక్క దోషమేగాని గుడ్డుదోషము కాదు. పెట్ట చక్కగా గూటిలో కూర్చుండుట కనుకూలించునట్లు చేసినయెడల ఈ దోషము సంభవింపదు. మంచిగూళ్లు లేనియెడల నీ దోషము సంభవింపకమానదు. తగినంత తేమలేనికారణమున ఒక్కొకవేళ పైచిప్పలు గట్టిపడి దిట్టమై పిల్లయెంతో బలముకలదిగా నుండును. అప్పుడు గ్రుడ్లు మంచివిగా నున్నను, పొదుగుటలో దోషము లేకున్నను, లోపల పిల్లపెరిగి పైకి వచ్చుటకు సిద్ధముగనున్నను, 21 దినములు గడచినను గుడ్లు పగులవు. 21 వ దినము కాగానే గుడ్లు చెడిపోయిన వని భావించరాదు. అట్టి సమయములలో మనము గ్రుడ్లలో నొకదానిని పైకితీసి వేడినీటిలో ముంచి జాగ్రత్తగా గుడ్డుయొక్క భాగములో కొంత తెరచి జీవమున్నదో లేదో చూచి యథా

స్థానములో నుంచవలెను. 23 వ నాటికి కొన్ని గుడ్లు పొదుగును. సాధారణముగా 23 దినములకు బయటకువచ్చిన పిల్లలు బలహీనములై తగినంతవేడి లేనందువలన ఆలస్యముగా పిల్లలగును.

## —* మూడవ రకపు గుడ్లు *—

గుడ్లను వేడినీటిలో తడిపి తిరిగి పొదగబెట్టినప్పుడు అవి మెత్తబడి లోపలిపిల్లలు దానిని పగులగొట్టుకొని పైకి వచ్చుటకు సిద్ధముగా నుండునట్లుండును. కాబట్టి 21 వ దినము గడచినను గుడ్లు పగిలి పిల్లలు రానప్పుడు వాటిలో నొక గుడ్డును జాగ్రత్తగా తెరచి చూచినప్పుడును అందు జీవకళలు కనబడనప్పుడును పై రీతిగా జేయవలెను. ఒకవేళ మిక్కిలి పొడిగా నుండుచోటనే పెట్ట తిరిగినను దానిగుండెమీదనుండు ఈకెలలో నెంతమాత్రమును తేమయుండదు. అప్పుడు వానిని తేమ

గానుండు గడ్డిమీద కొంచెముసే ఫుంచినయెడల నా తేమ శరీరమునకు సోకును. అంతట పెట్టలు గుడ్లమీద కూర్చుండి ఆరిపోయినగుడ్ల పెంకులకు తేమనిచ్చి యందుండి పిల్లలు పైకివచ్చునట్లు సదుపాయము చేసికొనును.

—* కోడిగుడ్ల పిల్లలగువిధము *—

పెట్ట తాను పెట్టిన గుడ్లపై కూర్చుండి వానిని పొదుగును. అది 20, 23 దినములవరకుగూడ పొదుగును. పెట్ట వానిపై కూర్చుండినది మొదలు పిల్లలేర్పడుట కారంభించును. దినదినప్రవర్థమానముగ లోపలనే పెరిగి అందుండు ద్రవములను స్వీకరించి పిల్లలు చక్కగా పెరుగుచుండును. ఇట్లు పదిదినములైనతరువాత దాని రూపమంతయు నేర్పడి రెక్కలులేవ నారంభించును. తరువాత క్రమముగ అవి పెరిగి పెద్దవై చిప్పలను ముక్కులతో పగులగొట్టి పైకి వచ్చును. పైకివచ్చిన కొంత

కాలమువరకు భయపడినపుడెల్ల తమ తల్లిరెక్కలలో దూరి దాగుకొనుచుండును.

—* కోడిపిల్లలను కాపాడుగంపలు *—

40, 50 పిల్లలు బహిరంగప్రదేశములలో విశ్రాంతిగా నుండుటకు వెదురుగంపలుగాని ఈతగంపలుగాని వాడుట చాల మంచిది. ఆగంపలకు అక్కడక్కడ తదితరజంతువులు దూరకుండ నుండునంత కంతలు పెట్టుట మంచిది. గంపనంతయు చిక్కగా నల్లకుండ పలుచగా నల్లుటయే చాలఉపయోగము. ఆగంపలలో కాపాడినపిల్లలకు గాలి ధారాళముగా వచ్చును. పిల్లలుకూడ ఆరోగ్యముగా నుండును. వాని కంతభయముకూడ నుండదు. గాలికిఎగిరిపోవు గంప లల్లించరాదు. అవి మిగుల బలముగలవిగా నుండవలెను.



ఉష్ణవాయు యంత్రము.

5

## —* గుడ్లను పొదిగించుయంత్రములు *—

కొన్నిజాతులకోళ్లు గ్రుడ్లువిస్తారముగా పెట్టునుగాని పెట్టిన గుడ్లను పొదుగజాలవు. మరికొన్ని జాతుల కోళ్లు గుడ్లను పొదుగునేగాని విస్తారముగా గ్రుడ్లు పెట్టలేవు. కాబట్టి విస్తారముగా గుడ్లుపెట్టుకోళ్ల న్నియు గ్రుడ్లను పొదుగునని మనము తలంచరాదు. అందువలన కోడి పొదుగశక్తిలేనిగుడ్లను పొదిగించుటకు యంత్రము లనేకములు వ్యాపించి యున్నవి.

## —* ఉష్ణవాయు యంత్రము *—

ఈయంత్రము చాలచౌకగా దొరకును. దీనిలో నీరుపోయవలసిన పెట్టె లుండకపోవుటవలన వెల తక్కువ. ఇది యొకవిధమైనపెట్టె. దీపపువేడివలన దీనిలోనున్న గుడ్లను పొదుగును. చల్లారిపోయిన గుడ్లను పొదుగవలసివచ్చినపుడు జలపేటికా యంత్రములోని నీరు వెచ్చనగుటకు కొంతకాలము

పట్టును. కాబట్టి ఆలస్యము చేయకుండ వెంటనే గుడ్లను యంత్రములో పెట్టవలసివచ్చినప్పుడు ఉష్ణవాయుయంత్రములు మిగులమంచివి. దాదాపు వేడి ఎక్కువగాకుండను, తగ్గిపోకుండను సరిగానుం చుట కీయుష్ణవాయుయంత్రములు ప్రసిద్ధములై నవి. కాని ఉష్ణవాయుయంత్రములలో దీపపు ఖర్చు చాలయెక్కువ. దీపము ఒకవేళఆరిపోయిన యెడల నష్టము సంభవించును. చలికాలములో అధికముగా కావలసినపుడు ఇది చాలినంత వేడి నీయజాలదు. ఈ దీపములో పెట్రోలు పోయ వలెను.

## —* జలపేటికాయంత్రము *—

ఇదికూడ ఒకవిధమైన పెట్టెయై యున్నది. దీనిలో నింకొక లోహసంబంధమైన పెట్టెయుం డును. ఈలోపలిపెట్టెనిండ నీరుపోసి మూతవేయ బడును. ఈలోపలిపెట్టె మూయబడినతరువాత

పైభాగమునందు గుడ్లు పెట్టబడును. సన్నని దీపపువేడివలన నీరు వెచ్చబడును. దీపపుయంత్రమునలన కాపాడుటచే నీరు విస్తారముగా వేడియై గుడ్లలోని జీవపదార్థమును చంపివేయలేదు. ఈవేడివలన క్రమక్రమముగా గుడ్లు పొదిగి పిల్లలగును. పైన చెప్పబడిన యంత్రములు ఐరోపా, అమెరికా, ఆస్ట్రేలియా దేశములవారు విస్తారము వాడుదురు. ఈ యంత్రములు కావలసినవారు లక్నోకోళ్ళ డిపార్టుమెంటువారికి వ్రాసిన పంపగలరు.

---

# కోళ్ళకుసంభవించు వ్యాధులు.

## కోళ్ళఆరోగ్యము

కోళ్ళకు ఆరోగ్యమే మహాభాగ్యమై యున్నది. కాని కోళ్ళను పెంచు యజమానులు వాటి సెట్టె

యారోగ్యస్థితిలో నుంచవలెనో యెరుగకున్నారు. ఆరోగ్యముగానున్న కోడిశరీరమునందలి ప్రతి అవయవమును, అందలి యంతర్భాగములును, తమనిర్ణీతకార్యక్రమము సరిగా చేయుచుండును. శరీరము ఆరోగ్యస్థితియం దుండి సుఖానుభవము నకు దగినటుల నుండిననే తప్ప లేనియెడల మంచి అందము లున్నకోడియైనను నిష్ప్రయోజనము. కోళ్ళపరిశ్రమాలయములలో నుండు కోళ్ళకన్న బీదలదగ్గర నుండునవి మిగుల ప్రయోజనకరములై యుండును. ఎందుచేత ననగా వారు చాల జాగ్రత్తగా మేపుదురు. కోళ్ళఆరోగ్యము చెడకుండు టకు తినుటకు మంచియాహారము, త్రాగుటకు మంచినీరు, పీల్చుటకు మంచిగాలి లభించు నటుల జేయుట మనకర్తవ్యము. కావున కోళ్ళను పెంచు ప్రతిమనిషియు వాటి నారోగ్యస్థితిలో నుం చుట తన ముఖ్యధర్మములలో నొకటిగా నెంచ వలెను.

## —♦ ఉష్ణము ♦—

ప్రపంచములోనుండు ప్రతిజీవాణువునుండి వేడి పుట్టును. చిన్న చిన్న అవయవములలో పుట్టు ఉష్ణత కొంచెముతక్కువగ నుండును. అస్థిపంజరము నంటియుండు ముఖ్యమైన కండరములనుండియే ఎక్కువఉష్ణత పుట్టును. కోడి యెట్టి దేహపరిశ్రమ లేక శాంతముగా నున్నప్పుడు ఉచ్ఛ్వాసనిశ్వాసములకు కారణములు కండరములై యున్నవి. ఇవి మిక్కిలి చురుకుగా పనిచేయును. అప్పుడా ప్రదేశమునుండియే ఉష్ణత బాగుగా కలుగును. మనముకోడిని పరీక్షించునప్పుడెల్ల సాధ్యమైనంత వరకు ఒకేపరిమాణముగల ఉష్ణత కలిగియుండును. కాని వానియొక్క వేడిమి యెల్లప్పుడును ఒకే మాదిరిగా నుండక కొన్ని డిగ్రీలమార్పు కలుగుచుండును. కోడికి 107 డిగ్రీల ఉష్ణము కలిగి యుండును. థర్మామీటరుతో పరీక్షింపవచ్చును.

6.

## —* దేహ పరిశ్రమ *—

కోడి తినునట్టి ఆహారము పూర్తిగా అరుగుటకును, రక్తాభిసరణము సరిగ నుండుటకును కావలసినంత దేహపరిశ్రమ శరీరమున కుండవలెను. కోళ్ళను పెంచు సోదరులారా! మీకోళ్ళకు తగినంతపరిశ్రమ నిచ్చుచుండినయెడల అవి సురక్షితముగ నుండును. అవి ఆడుకొనుటకు చిన్న పందిళ్లు వేసి డొక్కనారుతాడు పలుచగా అల్లి వాటిపైన కోళ్ళను విడిచిపెట్టవలెను. అట్లు విడిచి పెట్టిన యెడల నవి స్వేచ్ఛగా తిరిగి ఆనందించును.

## —♦ నాడి కొట్టుకొనుట ♦—

జంతువులకువలెనే పక్షులలో గూడ నాడిసాంప్రదాయము, మెదడు, మజ్జనాడులు అను మూడు భాగములతో జేరియున్నవి. సామాన్యముగ జంతువులంత తెలివి తేటలతో కోళ్లు ప్రవర్తింపజాలవు. కాని ఇంద్రియవిజ్ఞానము జంతువుల

కంటె వీనిలోనే నెక్కువగా నుండుననుట కేమియు సందియములేదు. ముఖ్యముగా మాంసభుక్కులైన పక్షులలో నేత్రేంద్రియవిజ్ఞాన మత్యద్భుతము. కోళ్ళచెవులు పైకి కనబడవు. తల కిరుప్రక్కలను రెండు చిన్న రంధ్రములు మెత్తని తూలిక యీకలచే గప్పబడియుండును. గాని జంతువులకువలె మాంసకండరములచేతను, ఉపాస్థి విశేషముచేతను, నిర్మితమై కర్ణభాగములు బయటకు గన్పట్టవు. ముక్కు కిరుప్రక్కలను పైభాగమున నుండు రెండు ద్వారములద్వారా ఘ్రాణవిజ్ఞానము కోళ్ళకు గలుగుచుండును. నాలుకవలన రసవిజ్ఞానము కొంతవర కేర్పడుచుండును. తలలో నుండి మూతి యేర్పడుచోట మూతియొక్క పైభాగముననే మాంసకండరవిశేషముచేత నిర్మింపబడిన ఎఱ్ఱనికట్టువలె నుండు అవయవమే వానికి ముఖ్యముగా త్వగింద్రియముగా నుపయోగపడును. మఱియు నాలుకవలన స్పర్శజ్ఞానము గలుగును.

## — వ్యాధిని కనుగొనుట —

యజమానిగాని వైద్యుడుగాని ఆపక్షి యెంత కాలమునుండి ఆరోగ్యముగా నున్నదో, ఎంత కాలమునుండి రోగముతో బాధపడుచున్నదో, మరియు నిదివరకు నెప్పుడైనను ఆపశువు యేరోగముచేతనైన బాధపడినదో, యను విషయములు జాగ్రత్తగా ముందు తెలిసికొనవలెను. తరువాత నా కోడికి వ్యాధి సంభవించినది లగాయతు కనబడుచున్న గుణములను గూర్చియు, యింక నా దొడ్డిలోనున్న కోళ్ళు యితర వ్యాధులచేతనైన బాధపడుచున్నవో లేవో మొదలగువానిని జాగ్రత్తగా తెలిసికొనవలెను. సామాన్యముగా కోడి ఆహారము తినుచున్నది లేనిదియును, అస్వస్థతగా నున్నట్లు కనబడుచున్నదియు లేనిదియును, అటు నిటు తిరుగుటకు యిష్టముగ నున్నది లేనిదియును తెలిసికొనవలెను.

## — వ్యాధి నిర్ణయము —

వ్యాధిగ్రస్థమగు కోడికి మందీయవలెనన్న ఆరంభములో నా వ్యాధియొక్క గుణమును, ఆ వ్యాధికున్న లక్షణములను తెలిసికొనవలెను. వ్యాధినిర్ణయము వ్యాధి లక్షణములనుబట్టి చేయవలెను. సామాన్యముగా మన స్వానుభవము మీద కూడ వ్యాధికారణము కొంతవరకు తెలిసికొనవచ్చును. వ్యాధి నిర్ణయము చేసిన తరువాత నాకోడిబాధను మాన్పి ఇంకను దానిని పూర్వస్థితిలోనికి తీసికొనివచ్చుటకు వలయు చికిత్సలను గూర్చి ఆలోచించవలయును.

## — రోగలక్షణములను బట్టి చేయు చికిత్స —

రోగముయొక్క కారణములను తెలిసికొనకుండ లక్షణములను బట్టి చికిత్స చేయుట అంత మంచిపద్ధతి కాదని నాయభిప్రాయము. ఒకేవిధమగు లక్షణములనుబట్టి చికిత్స చేసినయెడల

దానివలన యెట్టిలాభము లేకపోవుటయేగాక ఆరోగము క్రిమక్రిమముగా వృద్ధియై ప్రాణాపాయము కూడ గలుగును. కాబట్టి రోగకారణములు తెలిసికొని లక్షణములనుబట్టి చికిత్సచేయవలెను.

## —• జబ్బుకోడిని పరీక్షించుట •—

ఈ విషయము బాగుగా ఆలోచించి పరీక్షించవలెను. కొన్నికొన్ని వ్యాధులలో దుర్గుణము లుండవచ్చును. ప్రతిరోగమునకు మనము స్థిరమైన మందును అనగా నెమ్మదించువరకు నానావిధమగు ఔషధమునుగాని, చికిత్సనుగాని చేయజాలము. గాన వెంటనే రోగముపేరు నిర్ణయించరాదు. కోడి అవయవము లెట్లున్నవో, దాని ముఖకాంతి యెట్లున్నదో, అది కృశించుచున్నదో లేదో, శరీరమునం దెక్కడైన గాయము లున్నవేమో, అదివరకు యేమైన పందెములు వేసినదో మొదలగు విషయములు తెలిసికొనవలెను.

## —* ఊపిరితిత్తులవాపు *—

కోళ్ళుండు ప్రదేశములు మిక్కిలి తేమగనుండుటవలనగాని, చలిగాలి విశేషముగ తగులుటవలనగాని, వర్షములోను మంచులోను తడియుటవలనగాని ఈవ్యాధి తరచుగా కోళ్ళకు సంభవించుచుండును. ఇది మిక్కిలి హానికరమైనది. ఈవ్యాధి సోకిన పక్షికి ముఖము నలుపురంగుగా నుండును. ముక్కునుండియు నోటినుండియు రక్తమువలె నొకవిధమైన ద్రవము కారుచు శ్వాస, దగ్గు ఉండును. మందమతిగా నుండును.

### చికిత్స

| | |
|---|---|
| సారాయి | అరగరిటెడు |
| టింక్చర్ ఆఫ్ కానిట్ | 1 చుక్క |
| వేడినీరు | 2 గరిటెలు |

కలిపి మూడుగంటల కొకసారి ఈయవలెను. మెత్తని ఆహారము, పాలుమాత్ర మీయవలెను.

## —* అజీర్తి *—

కోడిపిల్లలకు అజీర్తి సామాన్యముగా గలుగు చుండును. ఇవి తమ తల్లులతో సమానముగా పరుగిడుచు వానితో పాటుగా మితిమీరి ధాన్యపు గింజలు వగైరాలు తినుటవలన ఈవ్యాధి వచ్చును. పిల్లలకు ఆహార మెక్కువై గొంతుక కదలక మెదలక యున్నపుడు మాత్రము ఒక గరిటెడు బైకార్బనేట్ ఆఫ్ సోడాను కొంచెము కలిపి పోయవలెను. అట్లు పోసిన తరువాత నెమ్మదిగా చేతులతో గొంతుకను చమరవలెను. దానికికూడ గుణమీయని యెడల ఒక గంటకు తరువాత ఒక అరగరిటెడు మంచినూనె పోయవలెను. 12 గంటలలో మందులు గుణమీయనిచో మందులు ఒకే పర్యాయ మిచ్చుచుండవలెను. వారమున కొకసారి భేదిఉప్పు నీటిలోకలిపి యిచ్చుటవలన కోళ్లకు అజీర్తి కలుగదు.

## —* ఆటలమ్మ *—

ఈ వ్యాధివలన కోళ్ళు విస్తారముగా చచ్చుచుండును. ఈవ్యాధితగిలిన పక్షిని ప్రత్యేకస్థలమునం దుంచవలెను. జెయిస్ ఫ్లూయిడ్ అను ద్రావకమును పొక్కులకు రాచి పొరను లాగి వేయవలెను. పుండ్లను ముందు నగరునీటితో గడిగి టించ్చర్ అయోడిన్ రాయవలెను.

## —* మశూచి *—

ఈవ్యాధి ఒక కోడినుండి మరియొక కోడికి వ్యాపించువ్యాధులలో నొకటియై యున్నది. ఇది మిక్కిలి ఉద్రేకకరమైనది. దీనియంతత్వరగా వ్యాపించువ్యాధి మరొకటి లేదని చెప్పవచ్చును. ఇది తదితర జ్వరములవలెనే యొకజ్వరముగా నెంచవచ్చును. కాని ఈజ్వరమందు కోడిచర్మమంతయు కంది పొక్కి చీముపట్టి పుండ్లేర్పడును. కోళ్ళుండు గూళ్ళనుండి ఈవ్యాధి గలదానిని ప్రత్యే

కముగా నుంచుటచేతను, అదియుండు స్థలమును వెంట వెంటనే శుభ్రము చేయుటచేతను ఈవ్యాధి యొక్క వ్యాపకము కొంతవరకు నిలుపవచ్చును.

పసుపు, వేపాకు ఆముదముతో నూరి పుండ్లపై వేయవలెను. లేక నీటికి రంగువచ్చువరకు మర్రి ఆకులను నీటిలో ఉడకబెట్టిన తరువాత యానీటిని వడపోసి సాయంకాలము వేళ శరీరమంతయు ఆ నీటితో తుడువవలెను.

—* రక్తగ్రహణి *—

క్రొత్తధాన్యము తినుటవలనను, అతివేడి వలలనను ఈవ్యాధి రావచ్చును. మలము వెంట నెత్తురు చీము బంక మొదలగునవి పడుచుండును. ముడ్డి తీపుండును. ఈ రోగముగలవానికి ఆముదము ఒక గరిటెడు ఈయవలెను. తరువాత ఒక అరగంటనే పాగి సీమఅవిసెనూనెనుగూడ ఒక గరిటెడు ఈయవలెను. అట్లిచ్చినయెడల కడుపులో నేవిధమైన బాధయు నుండదు.

## —* అతిసారము *—

కోడి తినుతిండిలో నుండులోపమువలన గాని, కడుపులో నొకవిధమైన పురుగుండుటవలనగాని, మురికినీరుత్రాగుటవలనగాని, అంటువ్యాధులవలన గాని రావచ్చును. ఎల్లప్పుడు పలుచగా విరేచనములగుచుండును. ఆవిరేచనములలో దుర్వాసనకూడ నుండవచ్చును. ఒకగరిటెడు తేయాకునీళ్లును, ఒక గరిటెడు మంచినూనె కలిపి ఈయవలెను.

## —* దగ్గు *—

కోళ్లు మంచులోను, వర్షములోను, తిరుగుట వలనగాని, శ్వాసకోశములలో ఒకవిధమైన పురుగుండుటవలన గాని ఈవ్యాధి రావచ్చును. ఇది కూడ కోళ్ళకు ఒకవిధమైన అంటువ్యాధియై యున్నది. ఈవ్యాధికలిగినకోడికి కర్పూరతైలము ఈకతో ముంచి నోటిలో నటునిటుత్రిప్పుచుండవలెను.

## —* రొంప *—

కోళ్ళను ఇరుకుగానుండు గూళ్ళలోనుంచుట వలనను, వానికి మంచు, చలిగాలి తగులుటవలనను ఈ వ్యాధి రావచ్చును. యూకలిప్టస్ ఆయిల్ ఒకటి రెండుచుక్కలు నీటిలో కలిపి త్రాగించవలెను.

## —* కుంటుట *—

ఎత్తుప్రదేశములనుండి దుముకుటవలనగాని, చీరుకొనిపోవుటవలనగాని, గాజుపెంకులు మున్నగునవి గ్రుచ్చుకొనుటవలనగాని గాయములు తగిలి కుంటుచుండును. వెంటనే దానిని కనుగొని వేడినీటితో బాగుగా కడిగి టించ్చర్ అయోడిన్ గాని ఐడోఫారంగాని వేయుట మంచిది. గాయములలో గాలి దూరకుండ కట్లు కట్టవలెను. ఇంక నిటువంటిపక్షుల నెక్కువగా తిరుగనీయరాదు.

## —*కడుపులో నొకజాతి పురుగులు పుట్టుట*—

ఎంతమంచియాహారము నిచ్చి పెంచిన కోళ్ళ

కడుపులలోనైనను ఒకజాతిపురుగులు పెరిగి ఆరోగ్యమును చెరచుచుండును. అందువలన మూడు దినములకొకసారి ఈదిగువమందీయవలెను. కస్ట్రారతైలము 10 లేక 12 చుక్కలను ఒకగరిటెడు అవిసినూనెలో కలిపి త్రాగించవలెను. ఈవ్యాధిగల కోళ్ళను విడిగానుంచవలెను. ఆహారములో ఉప్పును కలిపి పెట్టుచుండవలయును. పైమందు చిన్నవాటికి నాలుగవవంతు నీయవలెను.

### —* ఎఱ్ఱనిపురుగులు పట్టుట *—

ఈ పురుగులు పెంకెపురుగులవలెనుండి ఎఱుపురంగుగా నుండును. వీనివలన కోళ్ళశరీరారోగ్యము చెడిపోవును. వీటికి కొందరు సున్నపునీళ్ళతో కడుగుదురు. ఇదిమంచి పద్ధతియేగాని మంచమునకు నల్లులు పుట్టినపుడు పరుపులను యెండవేసిన యెడల యెంతలాభముండునో అట్లే యీపురుగులు దాగియుండుగూళ్ళ సందులను విడిచి కోళ్ళను కడుగుట

కూడ నంతియేలాభముండును. కాబట్టి ఇది మంచి పద్ధతికాదు. ఆరంభములోనే కోళ్ళగూళ్ళను, వాటి సందులనుకూడ కార్బాలిక్ లోషన్‌తోగాని ఫినైల్ లోషన్‌తోగాని కడుగవలెను. ఇట్లు కడుగుటవలన అవి రాజాలవు.

## — పేలు —

పేలు.కోళ్ళకు మిక్కిలి హానికరమైనవి. ఇవి పట్టినయెడల పక్షులన్నిటికి త్వరగ వ్యాపించును. చిన్న పక్షుల కివి పట్టినయెడల చావునకు సిద్ధమగునని తలంపవలయును. పేలుపట్టిన పక్షులను అమ్మ జూపినయెడల వాటికి మంచిధరలు రాజాలవు. వానివలన రాబడి తక్కువయు ఖర్చు లధికమును నగును. పేలు చేయు హాని యింతింత యని చెప్ప శక్యముగాదు. ఇవి పుట్టకుండ నుండవలెనేగాని పుట్టిన పిమ్మట మిక్కిలి స్వల్పకాలములోనే అసంఖ్యాకములుగ వృద్ధిజెంది మందలోని పక్షులన్ని

టికి వ్యాపించును. పూర్తిగా వ్యాపించిన తరువాత వీనిని నిర్మూలించుట కష్టసాధ్యము గాన ముందు గనే జాగ్రత్త వహించుట మంచిది. ఈ పేలు పట్టిన పక్షులను చూచి వెంటనే గుర్తింపవచ్చును. అట్టి పక్షులు జబ్బుగా నున్నట్లు పాలిపోయి బద్ధకముగా కన్పించును. చురుకుగా నుండవు. పేల వలన తదితర రోగములు ప్రవేశించి పక్షులను బలహీనములుగా జేయును. ఈ పేలు పక్షులకు భరింపరానంత బాధను కలిగించును. వీటివలన గ్రుడ్లను పొదుగు పక్షులు గూళ్ళలోనే చనిపోవు చుండుటయు, గ్రుడ్లను పొదగకుండ అవి విడిచి పోవుచుండుటయు జరుగుచుండును. తల్లిపక్షులను బాధించుచుండు ఈ పేలు చిన్నపిల్లలకుకూడ వ్యాపించి వెంటనే చనిపోవును. పేలలోకూడ వివిధరకములు గలవు.

క్రొత్తపక్షులను దెచ్చి మందలోగలుపు నపుడు

వానిని జాగ్రత్తగా పేలు లేనివిగ పరీక్షించిన తరువాత కలుపవలెను. లేనియెడల వాని కట్టిపేలైనన్న యెడల నవి మందకంతకును బట్టుకొని హాని చేయును. పక్షులను పరిశుభ్రముగనుంచి వానికి సకాలమునందు ఆహారాదుల నొసంగుచు జాగ్రత్త వహింపక వానిని పెంచుటవలన యేమియు ప్రయోజనము లేదు.

కోళ్ళగూళ్ళలో నేమైన పేలున్న యెడల వెంటనే వాటిని శుభ్రముగా లోషన్ నీటితో కడుగవలెను. తరువాత నొక పళ్ళెములో గంధకము వేసి దానిని వెలిగించి గూటిలోపెట్టి తలుపులు కిటికీలు మూసి యుంచవలెను. లోపల పక్షులులేకుండ జేసిన తరువాత నిట్లు చేయవలెను. లేనియెడల నవి యూపిరి తిరుగక చనిపోవును. పేలు కిటికీలు, తలుపుల సందులలో దూరి దాగుకొని యుండును. అట్టి సమయములలో

ఒక కుంచెను తీసికొని దానితో తారును గూళ్లకు తలుపులకు, కిటికీలకు పైన బాగుగా రాయవలెను. ఇట్లు వ్రాయుటచేత పై భాగమునందుండు పేలన్నియు చనిపోవును. లోపల దాగియున్నను బయటకు రాజాలవు. గంధకపుపొగ యెంత వేసిన అన్ని యెక్కువ పేలు చనిపోవును.

## —* కంతిరోగము *—

ఇది కోళ్ళకు ప్రాణాపాయము కలిగించును. ఈవ్యాధికి మందే లేదు. ఈవ్యాధితగిలిన వాటిని ప్రత్యేకముగా నుంచవలెను. అవియున్న గూళ్ళను శుభ్రముగా లోషన్ నీళ్ళతో కడుగుచుండవలెను. ఈజబ్బు మనుష్యులకు కూడ ప్రాణహాని కలిగించును.

## —* ఒకమనవి *—

కోళ్ళకు అంటుసంబంధమైన వ్యాధులు కలిగినపుడు మీతాలూకా వెటరినరీ డాక్టరుగారికి

చూపించిన అవసరమున్న యింజెక్షను చేయుదురు.

—* మట్టిలో చూర్ణములు జల్లుట *—

కోళ్లు భూమిని కాళ్ళతో గీచుచుండుట వాని స్వాభావికమైయున్నది. కనుక నవిసంచరించు ప్రదేశములలో బూడిదతో మిశ్రమముచేసిపొగాకుపొడి గాని, గంధకపుపొడిగాని చల్లినయెడల నవిపొర్లాడునపుడు యీ బూడిద వాని రెక్కలయందు, దేహమందు అంటుకొనును. అప్పుడు పురుగులు నశించగలవు.

—* పెట్ట గుడ్లుపెట్టలేకపోవుట *—

కొన్నిపక్షులు గుడ్లుపెట్టలేక మిక్కిలి బాధపడుచుండును. గుడ్లు పెట్టవలెనని గూటిదగ్గరకు వెళ్ళి పెట్టలేక మరల వచ్చుచుండును. అట్టిసమయమున వానికి విశ్రాంతి యుండదు. ఇట్లు గుడ్లు పెట్టలేకపోవుటకు మధ్య నేదో యడ్డుపడుటగాని, మిక్కిలి పెద్దగుడ్లు యగుటగాని కారణమై యుం

డును. సామాన్యముగా కొ్రివ్వెక్కి బలిసియున్న పశువులకే యీబాధ సంభవించును. ఇట్లు గుడ్లు పెట్టలేక బాధపడినపుడు గుడ్లు వచ్చు ద్వారము దగ్గర చమురు రాచి ఆవిరిపట్టవలెను. పచ్చి యాహారమును విశేషముగా నొసగవలెను. దీనివలన గుడ్లు బయటకు రానియెడల వ్రేలునకు చమురు రాచి లోపలికి పోనిచ్చి గ్రుడ్లను చిదిపివేయవలెను. ఇట్లు చిదిపివేయబడిన పదార్థమును పై పెంకులతో గూడ సంపూర్తిగా బయటకు లాగివేయవలెను. పెంకుముక్కల నెంతమాత్రము లోపలవిడువ రాదు. బాధచెందినపశువులకు మాంసముగాని, కొ్రివ్వుపదార్థములు గాని, బెల్లపుపానకముగాని పెట్టవలెను.

—* వా త ము *—

ఈవ్యాధి బలహీనతవలనను, కాళ్ళలో నొప్పు లుండుటవలనను, అతిచలిలో తిరుగుటవలననుగూడ నీవ్యాధి రావచ్చును.

ఈ వ్యాధిగల పక్షులను తేమగల ప్రదేశము లలో సంచరారాదు. లినిమింట్ అయోడిన్ కాళ్ళ భాగములకు రుద్దవలెను.

అప్పుడప్పుడు ఉప్పునీటిని త్రాగించవలెను. పచ్చి యాహారము పెట్టవలెను.

కోళ్లు విషసంబంధమైన పురుగులను తినునప్పుడు వానిని బాగుగా పరీక్షించి తగినచికిత్సలు చేయవ లెను. విషము రక్తములో జీర్ణించిన ఆకోడి బ్రతుక జాలదు.

—* కలరా *—

కోళ్లకు ఈవ్యాధివచ్చినపుడు పసుపు తెలుపు రంగుగల విరేచనములు తరచుగా నగుచుండును. ఎక్కువజ్వర ముండును. దాహ మెక్కువగా నుం డును. 48 గంటలు లగాయతు 72 గంటలవరకు ఈవ్యాధి యుండును. ఈలోపుగా నేమైన చికిత్స చేయవలెను. తెరువాత నేమిచేసినను లాభము

లేదు. ఈవ్యాధికలిగిన కోళ్లను దూరముగా నుంచి కూళ్లను పరిశుభ్రముచేయవలెను.

---

# ఆఱవభాగము

## —* బాతులను పెంచుట *—

బాతులు చాలా మెలకువగల పక్షులు. బహు కొద్దిధ్వనిసయితము కలిగినయెడల నవి నిదురనుండి లేచును. చీకటిచాటున శత్రువులు వచ్చుచున్నారని రోముపట్టణస్థుల కివి యీలాగున తెలియజేసి ఆ పట్టణమును రక్షించినట్లు చెప్పెదురు. ఇందుచేతనే వీరు ఈ జాతిపక్షులను కొన్నిటిని పెంచుటకై సంవత్సరమున కొకసారి కొంతసొమ్ము ఖర్చుపెట్టెడివారట. జర్మనీదేశములో నొకబాతు ప్రతిఆదివారమునాడును ఒక ముసలి ఆడమనిషిని గుడికి తీసికొని వెళ్లుచుండెడిదట. అది ఆమె బట్టకొనను బట్టుకొని ఆమె మామూలుగా కూర్చుండు స్థలమువరకు నడిపించెడిదట. తర్వాత నది గుడి చుట్టునుండుగడ్డిని తినుటకు పోయెడిదట. ఆరాధనమయినతరువాతగూడ నది విశ్వాసముగల కుక్క



వడిగా పరుగెత్తు బాతులు.

వలె కనిపెట్టుకొనియుండి తన యజమానురాలిని ఇంటికి తీసికొని పోయెడిదట. బాతులలో మగ బాతు తనకుటుంబమును వెంటబెట్టుకొని గర్వముగా నడచును. కాని అది కోడిపుంజంత ధైర్యముకలదిగాదు. తన ఆడుబాతులను కాపాడుటకు ఎప్పుడును ప్రయత్నింపదు.

సాధారణబాతులు అడవిబాతులనుండి పుట్టినవి. కోడికిని దీనికిని చాల భేదము కలదు. ఒక కోడి నీటిలోనికి వెళ్లినయెడల దాని శరీరమంతయును తడియును. బాతునకు నీళ్ళు దాని ఈకెలలోనికి జొరకుండునట్లు ఒక విధమైనచమురు గలదు. నీటిలో తేలికగానడచుటకు వీని కాళ్లు ఒక విధమగుతెడ్లవలె నుండును. చీనాదేశస్థులు పొట్టిబాతుల నెక్కువగా పెంచుదురు. గుడ్ల లోపలి పిల్లలు గ్రుడ్లను బద్దలుచేసికొని బైటికివచ్చు నంతవరకు చీనావారు ఈగుడ్లను వేడి యిసుకలో నుంచుదురు. ప్రతిచిన్నపిల్లకును తినుటకు

కొంతకావలెను. కనుక వండిన అన్నపుసంచిని చేతపుచ్చుకొని యొక కుర్రవాడు ఎప్పుడును వాటిని కాచుకొని మేతవేయుచుండును. అవి కొంచెము పెద్దవగుటతోడనే వాటి యాహారము నవి వెతకికొని తినగలవు. తరువాత నవి మూడు నాలుగువందల బాతులుగల యొక పడవలోనికి తీసికొని పోబడును. కొంతదూరము వెళ్లినతరువాత నవియన్నియు నీటిలోనికి దుముకును. ప్రతి మందకును ఒక పెద్దపక్షియుండి తల్లివలె నితర వాటిని కాపాడును. అవి వాటిని ఆహారముదొరకు స్థలములకు తీసికొనిపోయి చాలా దూరము పోకుండా భద్రముగా నుండునట్లు చేయును. సూర్యు డస్తమించునప్పుడు వాటి యజమాని యొకవిధమైన ధ్వని చేయును. అది విని యన్నియు గుంపుగూడి ఇండ్లకు పోవును. ఏగుంపున కైనను పడవ తెలియును. చీనాదేశస్థులు అడవిబాతులను

యీా క్రిందివిధముగా పట్టుకొందురు. అవి ఈదు చున్న స్థలములకు తిన్నగా సొరకాయలు తేలి కొట్టుకొని పోవునట్లు చేయుదురు. బాతులు వీటిని లక్ష్యముచేయవు. అంతట ఒక మనిషి తలకు ఒక సొరకాయను కట్టుకొని ఈదుచు వాటివద్దకు పోవును. నెమ్మదిగా నవి యీదుచున్నస్థలము నకు పోయి నీటిక్రిందకు నొకదాని తర్వాత మరి యొకదానిని లాగును. చీనాదేశస్థులు బాతులను చీల్చి చేపలవలె ఎండబెట్టుదురు.

పెంపుడు పెద్దబాతులు అడవిబాతులనుండి పుట్టినవి. ఈ బాతులయీాకెలు యూరపుఖండ మందు పరుపులకును, తలగడలకును ఉపయోగింప బడును. పూర్వము ఈబాతుకలములనే వ్రాయుట కుపయోగించెడివారు. పెంపుడుబాతు లెక్కు వగా భూమిమీాదనే నివసించును. అడవిబాతులు ముఖ్యముగా నీళ్లయందే నివసించును.

—* శరీరనిర్మాణము *—

వానిశరీరము పెద్దదిగను, నావయొక్క ఆకారము గలదిగను ఉండును. ఆదియందు మనుజుడు నావలను నిర్మించుమార్గమును వీని శరీరరూపములను బట్టిగాని, చేపలరూపములను బట్టిగాని నేర్చియుండవచ్చును.

—* కాళ్లు *—

దీనికి రెండుకాళ్లుండును. ఇవి పొట్టివిగను, దళముగను ఉండును. శరీరపృష్టభాగమున నివి యమర్చబడి యుండును. ఇందువలన నవి బాగుగను సులభముగను నీటియందీదులాడుట సంభవించుచున్నది. నీటిపై చరించునప్పుడు వీని గమనగతి చోద్యముగా నుండును?

—* పాదములు *—

వీనిపాదములు కొంచెము పసిమివర్ణము గలవిగా నుండును. ప్రతిపాదమునకు నాలుగేసి వ్రేళ్లుం



మంచిలక్షణములుగల పొట్టిబాతులు.

డును. అందు మూడు ముందువైపుగను, ఒకటి వెనుకభాగమునకు తిరిగి యుండును. ముందుండు నవి చర్మముతోఁగూడ నుండును. ఈ చర్మ మతి దళమైనదిగను,సులభముగ చిరుగనిదిగను ఉండును. ఈదులాడునపు డీపక్షులు తమ ముందటివ్రేళ్ళ నొక్కటిగ జేర్చి నీటి కెదురుగ పోనిచ్చుచుండును. కాళ్ళను వెనుకకు తీసికొనినపు డావ్రేళ్ళను తెరచు-చుండును. ఇవి భూమిమీద సంచరించునపుడు పాదములు పూర్ణముగ తెరువబడియే యుండును.

—• ముట్టి •—

వీటిముట్టి పలుచగను, వైశాల్యము గలదిగను, కొంచెము పసిమివర్ణము గలదిగను, దృఢమైనదిగను, బలమైనదిగను ఉండును. లోపలి భాగమున పండ్లవరుసను బోలినవి కొన్ని యుండును. కాని యవి నిజముగ పండ్లుకావు. నడియ కట్టుట కుపచరించు సాధనముల వంటివిగా నుం

డును. వీని నాలుక పెద్దదిగను, కండపుయముగ నుండును. నాలుకచుట్టును అంచులు కట్టినట్లుండును. ఆహారము కావలసినప్పుడే బాతులు తమ ముట్టిని గుద్దలివలె నుపయోగించి బురదలో దాగియుండు జీవరాసులను బురదతోను, నీటితోను కలిపి లోపలికి లాగుకొనును. నాలుకచుట్టు నుండు సాధనములచే నీటిని, బురదను పైకి త్రోసివేసి ఆహారమున కుపయోగించు జీవులను మాత్రము మ్రింగుచుండును.

## కంఠము

వీని కంఠము మిక్కిలి పొడుగుగ నుండును. కంఠము కాళ్ళకన్న దీర్ఘముగ నుండును. ఇది యొక విచిత్రాంశమే. వీనిమెడ పొడుగుగా నుండుటచేతనే ఇవి సులభముగ నాహారమును వెదకికొనుటకు వీలగుచున్నది. వీనికి ముఖ్యాహారములగునవి నీటియందే లభ్యములగుటచే వీనికంఠము

అందులకు మిక్కిలి సహాయకారిగా నుండును.

—♦ శరీరముపైనుండు కప్పు ♦—

వీని శరీరమంతయును తెలుపుగా నుండు ఈకెలతో నిండియుండును. ఈ యీకెల కడుగుభాగమున మృదువైన చిన్న యీకెలపఱపు లుండును. అందుచేతనే ఎంత చల్లని నీటిలో నీదులాడుచుండినను వీనికి చలివలన బాధ లేకుండును. వీని శరీరభాగము పైనుండుయీకెలు చర్మము నంటియుండును. మధ్య ఖాళీ యెంతమాత్రము నుండదు. వీని ఈక లెప్పుడు తడిసియుండవు. వీని తోకలకు సమీపమందు చమురుతిత్తి యొకటి గలదు. ముక్కుతో నీ చమురును ఈకలకు రాచుకొనుచుండును. చమురు గలిగినవి గాన నీటితో తడుపబడవు.

—♦ బాతులను పెంచువారి క్రిందివిషయము లను తెలిసికొనవలెను ♦—

బాతులను కాళ్ళతో పట్టుకొని యెత్తరాదు.

రాత్రిపూట దీపము చేతబట్టుకొని బాతులనడుమ నుండి పోరాదు. ఎండిన సున్నమును బాతు లుండు తావులకు చేరనీయరాదు. పెద్దవిగా నుండు బాతు గుడ్లు పొదిగి పిల్లలు కావు. కాబట్టి వానిని ఏడ దీసి పిల్లలు చేయుటకు ప్రయత్నించరాదు. రాత్రులయందు వీనిని ఒకదొడ్డిలో తడి యెంత మాత్రమును లేనిచోట నుంచి తాళము వేయవలెను. రాత్రులయందు వీనిని సంచరింపనీయరాదు. అప్పుడే యవి గుడ్లుకూడ పెట్టును. కాబట్టి వానిని ప్రత్యేకముగా నుంచుటకు మనకు వీలుకలుగదు. గుడ్లుపెట్టుబాతులను తొందరగా పరుగెత్తించరాదు. రోగము తగిలిన బాతులను బాగుచేయుట దుస్తరము. అందువలన నాకాలములో విశేషముగా నీరుల్లిపాయలను వానిచేత తినిపించవలెను. ఎండిన యాహారపదార్థములు పొడిమందులు నీయవచ్చును. బాతులను కోళ్లను

కలిసి తిరుగునటుల చేయరాదు. బాతులను, కోళ్ళను యేకపాత్రములో నీరుపోసి త్రాగించరాదు. అట్లు జేసినయెడల నవి రోగముల పాలగును. వంగిన నడుములు, వంకరతోకలు గల పక్షులు పొదుగుటకు పనికిరావు.

—* బాతుగుడ్లు *—

గుడ్ల వ్యాపారము చేయువారికి కోళ్ళను పెంచుట కంటె గుడ్లె నెక్కువగా బెట్టు బాతులను పెంచుట లాభకరము. దీనికి కారణముల నేకములు గలవు. కోళ్లకంటె బాతు లెక్కువశీతమునకు దాళగలవు. శీతాకాలములో నివి కోళ్లవలె గుడ్లు పెట్టుట మాని వేయవు. రన్నర్ జాతిబాతు లెక్కువగుడ్లను బెట్టును. ఇందు చాలభాగము గుడ్లు శీతాకాలములో లభించును. ఈజాతిబాతులు యేమాత్రము అవకాశమొసగినను స్వేచ్ఛగ దొడ్లలో నెగురుచు దిరుగుచుండును. మంచిజాతిబాతులు సంవత్సరము

పొదుగునను గుడ్లను బెట్టుచుండును. మధ్యమధ్య కొన్ని దినములు వ్యవధితో బెట్టుటయుగలదు. ఆరు నెలల పక్షియైనప్పటినుండియు నాలుగైదు సంవత్సరములవయస్సు వచ్చువరకు గుడ్లను బెట్టుచుండును. అంతకంటె నెక్కువకాలముగూడ పెట్టుట కలదు. రెండున్నరసంవత్సరములనాటికి ప్రశస్తమైన గుడ్లను బెట్టగలుగును. కోడిగుడ్లకంటె వీని కెక్కువధర వచ్చును. కోడిగుడ్లకంటె నివి పెద్దవిగ నుండును. బాతులను పెద్దచెరువులలోనికి విడిచినయెడల నవి యందే గుడ్లుపెట్టును. కావున నవి నీటిలో బడిపోవును. కాబట్టి గుడ్లుపెట్టువానిని అటువంటిచెరువులలోనికి పోనీయరాదు.

# ఆయుర్వేదపశు చికిత్సాలయము,

# అంగలూరు.

## చికిత్సాలయము ముఖ్యోద్దేశ్యములు.

1. అన్ని జిల్లాలలోను మా చికిత్సాలయమునకు బ్రాంచి ఆఫీసులు స్థాపించి ఆయుర్వేద పశు వైద్యమును వ్యాపింపజేయుట.
2. మా పశువైద్య గ్రంథనిలయము తరఫున నూతన గ్రంథముల ప్రచురించి పశువైద్య విజ్ఞానమును వ్యాపింపజేయుట.
3. పరిస్థితులననుసరించి పశురోగములగూర్చి వ్యాసములు, వార్తాపత్రికల మూలమునను, కరపత్రముల మూలమునను రైతులకు తెలియజేయుట.
4. మున్ముందు పశుచికిత్స విషయమై "పశుసంరక్షణ" యను మాసపత్రికను స్థాపించుట.

పశుప్రదర్శనము, వ్యాధులు, చికిత్సలు మున్నగునవి మ్యాజిక్‌లాంతరు ద్వారా తెలియపరచుట.

ప్రతిసంవత్సరము 15 మంది విద్యార్థులను తర్ఫీతు చేసి బ్రాంచి ఆఫీసులకు పంపించుట.

# ఆయుర్వేద పశువైద్యము

డాక్టర్. యన్. వెంకటరెడ్డిగారు :—

శ్రీయుత యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు ఆయుర్వేద పశువైద్యము చేయుటకే కంకణము కట్టుకొనినారు. మానవ ఆయుర్వేదమును పండిత డి. గోపాలాచార్యులుగారెట్లు వృద్ధిలోనికి దెచ్చి ఆంగ్లేయ వైద్యశాలలవలె ఆయుర్వేద వైద్యశాలల నెట్లు స్థాపించిరో నేను చౌదరిగారుకూడ ఆమాదిరిగనే వ్యాప్తి పొందజేయవలెనని కంకణము కట్టుకొనినటుల వారు దీనిలో ప్రకటించిన పశుచికిత్సాలయముఖ్యోద్దేశములలో తెలియుచున్నది. కాని ఇటువంటి సంస్థలకు తగినంతధనము కావలెను. పలుకుబడి కావలెను. గవర్నమెంటువారిసహాయము కావలెను. పశువైద్యశాస్త్రము నుపయోగించుకొని పరిశీలనద్వారా చవుకరకముల రక్షణమార్గములను వెటరినరీవారు కనుగొన ప్రయత్నింపవలయును. అనుభవపశువైద్యచింతామణిలో తెలిపిన చికిత్సలన్నియు ఆయుర్వేదచికిత్సలే. డబ్బుఖర్చులేనివియు, అన్నిచోటుల దొరకునవిగానుండు చికిత్సలను చూచి రైతులపరిమితానందము పొందుదురనుట కెంతమాత్రము సందియములేదు. కాని ఆర్థికపరిస్థితులనుబట్టి కొలదిప్రతులుమాత్రమే ముద్రించినటుల తెలియుచున్నది. ఇంక పెక్కుప్రతులు ముద్రింపించి వ్యాప్తికి తీసికొనివచ్చుదురుగాక యని ప్రార్థించుచున్నాను.



ప్రింటగుచున్నది! డెమ్మీ సైజు!! చక్కని బైండు!!!

# అనుభవ పశువైద్య చింతామణి.

సుమారు 1000 పేజీలుగలది. 100 ఫొటోలుగలది.

ఈ గ్రంథము కన్నడభాషలోనికి అనువదించుటకు బెంగుళూరుజిల్లాలో నొకరికి పర్మిషన్ యియ్యడమైనది. ఈగ్రంథము మీదగ్గరనున్న పశువుల డాక్టర్లతో నిమిత్తము లేదు. పశువైద్యులకొరకు మరొకగ్రామము వెళ్ళనవసరము లేదు. ఇటువంటి యుత్కృష్టగ్రంథము ఆంధ్రదేశములో నింతవరకు వెలువడియుండ లేదని నేను గట్టిగా చెప్పగలను. ఇంకను మీ రెన్నడు చూడని చక్కని సాంప్రదాయముగల పశువులఫొటోలు ఆర్టుపేపరు మీద ప్రకటింపబడుచున్నవి. ఇప్పటికిని వాతలు వేసి పశువులను చంపుచున్నారు. అట్లుచేయకుండు

టకు ప్రత్యేకముగా చక్కానిగుర్తులతో ఆయా చికిత్సల దగ్గరనే 50 బొమ్మలు పడుచున్నవి.

దీనిని 30 భాగములుగా విభజించితిని. పశు శరీరశాస్త్రసంబంధమైన బొమ్మలు, మూషిపశువులను సంబంధించిన బొమ్మలు మున్నగునవికూడ పడుచున్నవి.

—* నానాజాతిపశువుల చరిత్రలు *—

పశుగర్భనిర్మాణ చరిత్ర
పాడి పశువుల సంరక్షణ
పశుపరీక్ష — సుళ్ళు
పశుశరీరనిర్మాణశాస్త్రము
పశుపోషణ — పశుశాల
పశువులమేత
పశువైద్యసూత్రములు
విషములు పెట్టుట

రక్తసంబంధమైన వ్యాధులు
జీర్ణసంబంధమైన ,,
వాతసంబంధమైన ,,
మూత్ర సంబంధమైన ,,
శిరోసంబంధమైన ,,
నేత్రి సంబంధమైన ,,
వాపు సంబంధమైన ,,
వ్రిణ సంబంధమైన ,,
గొంతుసంబంధమైన ,,
చెవి సంబంధమైన ,,
శస్త్రిసంబంధమైన ,,
చర్మసంబంధమైన ,,
బుడ్డకొట్టుటలో పలురకములు.
నానాజాతిపాముల కాట్లు

మున్నగు వాని కింకను చాలవివరములు వ్రాయ బడినవి. ప్రతిగ్రామమువందు దొరకుమామూలు

పసరు చికిత్సలు ఈగ్రంథమున నెన్నియో గలవు. ఈ గ్రంథము ఒకనవలకాదు. నాటకముగాదు. మీజీవితకాలము గడచిన తరువాతకూడ తరతరములవరకు మీకుటుంబమునకు యీగ్రంథము పనికివచ్చును. కాబట్టి ఈ గ్రంథమునకు వెంటనే ఆర్డరిప్పించగలందులకు తమరిని ప్రార్థించుచున్నాను.

---

# పశువైద్య వస్తుగుణ దీపిక.

పీఠికకర్తలు:

మదరాసు ప్రధానమంత్రులగు ఆనరబుల్ దివానుబహద్దర్ బి. మునుస్వామినాయుడు, బి.ఏ., బి. యల్., గారు.

వీరు పీఠిక వ్రాసి ఈ గ్రంథమునకు వన్నెదెచ్చిరి.

అనుభవపశువైద్యచింతామణికి అనుబంధముగా తప్పక పశువైద్యవస్తుగుణదీపిక యుండవలెను. ఈ గ్రంథము వస్తువులయొక్క గుణములు తెలుపును. చింతామణిలోనున్న రోగములకు చికిత్సలు చేయవలెనన్న వస్తుగుణములు తెలిసికొని చేయుట మిగుల మంచిది. 1929 వ సంవత్సరములో శ్రీ చల్లపల్లి రాజాగారి పట్టాభిషేక మహోత్సవసందర్భమున వారిధనసహాయముచే ప్రకటింపబడెను. ఇంకను 300 ప్రతులు గలవు. వెల రు. 2—0—0.

# పశువైద్య గ్రంధనిలయము,
## అంగలూరు.

| | | |
|---|---|---|
| పశువైద్యవస్తుగుణదీపిక | ... | రు 2-0-0 |
| పశువ్రణచికిత్స | ... | 0-8-0 |
| పశునేత్రచికిత్స | ... | 0-8-0 |
| కోళ్ళపరిశ్రమ | ... | 0-8-0 |
| గోమారితైలము | ... | 1-0-0 |
| పశునేత్రాంజనము | ... | 1-0-0 |
| పశువ్రణహారిమలాము | ... | 1-0-0 |
| తోకకిర్రిసంహారిణి | ... | 1-0-0 |
| విషనివారిణి | ... | 0-4-0 |
| అనాసక్తి యోగము | ... | 0-3-0 |

వలయువారు :—

ఆయుర్వేద పేటెన్టు డిస్పెన్సరీ,

అంగలూరు, (కృష్ణాజిల్లా.)



| | |
|---|---|
| | **మనసు ఫౌండేషన్** <br> **పుస్తకాల పరిశీలనాపట్టిక** |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B193 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 171 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ఏ,1,2,4,6,8,9,41,5,16B,18B,[illegible] 10B,20B 64A,76A, 78B,102B 106A |
| లేని పేజీలు | 1 TO 4 |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | pratyusha |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |